శ్రీరస్తు

# ఆబ్దిక సర్వస్వమ్

## యాజుష స్మార్త గ్రంథః, చతుర్థ భాగరూపః
## సకలశ్రాద్ధ సహితః ఉదకశాంతి సహితశ్చ

: సంకలనము :
పురోహిత సార్వభౌమ, అధ్యాపక శిరోమణి
**మార్తి వేంకట్రామ శర్మ**
స్మార్త పండిట్
కీసరగుట్ట.

: ప్రకాశకులు :
**శ్రీనివాస గ్రంథ మాల**
**H.No** 7-93, అయ్యప్ప కాలనీ, ఫేస్-3,
నాగారం (పోస్ట్), హైదరాబాద్ : 500 083. ఫోన్ : 040 - 27128168.

**श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्,**
**दक्षिणाम्नाय श्री शारदापीठम् शृङ्गेरी.**

SRI SRI JAGADGURU SHANKARACHARYA MAHASAMSTHANAM
DAKSHINAMNAYA SRI SHARADA PEETHAM, SRINGERI - 577 139.

PRIVATE SECRETARY
To His Holiness Sri Jagadguru
Shankaracharya Dakshinamnaya
Sri Sharada Peetham,
SRINGERI - 577 139. (Karnataka)



Camp : శృంగేరి
Ref : D 1/10139
Date : 25/4/2005

బ్రః వేః మార్తి వేంకట్రామ శర్మగారికి నమస్కారములు.

మీరు మిగుల శ్రద్ధతో సంకలనమొనర్చిన 'ఆబ్దిక సర్వస్వము' అను గ్రంథమును శ్రీచరణులు అవలోకించినారు.

మీరు మీ తండ్రిగారివద్ద ప్రయోగమును చక్కగా నేర్చుకొని సంప్రదాయమును బాగుగా తెలిసినవారై పురోహితోత్తములుగనున్నారు. కర్మశ్రద్ధసన్నగిల్లుచున్న నేటి కాలమునందు మీ వంటి వారలు ఇట్టి గ్రంథములను ప్రకటించుట ప్రశంసనీయముగనున్నది. ఈ గ్రంథ ప్రకాశనమునందు శ్రీమిట్టకంటి మధుసూదనరెడ్డిగారు మీకు తోడ్పడియుండుట ముదావహము.

శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల కృపవలన ఈ గ్రంథము కర్మశ్రద్ధాళువులకు అత్యంతోపయుక్తమై బహుళప్రచారమునొందుగాక, మీకును శ్రీమధుసూదనరెడ్డి గారికిని ఇతోధికశ్రేయః ప్రాప్తియగుగాకయని శ్రీజగద్గురు మహాస్వామివారు ఆశీర్వదించినారు.

(తంగిరాల దక్షిణామూర్తి)

శ్లో॥ చిద్ఘనాయ ప్రకాశాయ శృత్యాకాశ విహారిణే ।
అద్వైతామృత వర్షాయ శంకరాయ నమోనమః ॥



జగద్గురు ఆదిశంకరులు.

శ్లో॥ వివేకినం మహా ప్రాజ్ఞం ధైర్యౌదార్య క్షమానిధిం ।
సదాఽభినవ పూర్వంతం విద్యాతీర్థ గురుంభజే ॥



శ్రీశ్రీశ్రీ శృంగేరి జగద్గురు అభినవ విద్యా తీర్థ మహా స్వామి వారు

శ్లో॥ అజ్ఞానాం జాహ్నవీ తీర్థం విద్యా తీర్థం వివేకినాం ।
సర్వేషాం సుఖదం తీర్థం భారతీ తీర్థమాశ్రయే ॥



శ్రీశ్రీశ్రీ శృంగేరి జగద్గురు భారతీ తీర్థ మహా స్వామి వారు

# గురువందనం



అస్మత్పితృపాదులు, గురువర్యులు
కీ॥శే॥ మూర్తి కోదండ పాణి శాస్త్రిగారు,
శ్రీమతి రామలక్ష్మమ్మగారు.

శ్లో॥ కోదండపాణిం జనకం కరుణాపూర్ణ మానసమ్ ।
మాతరం రామలక్ష్మీంచ వందే భక్త్యాసు తత్వదామ్ ॥

జననం:-శ్లో॥ ప్రాదుర్భూతః ప్రమోదాబ్దే హేమంతే మార్గ శీర్షకే ।
శుక్లేచార్కతృతీ యాయాం వేంకట్రామ సుతస్సుధీః ॥

నిధనం:-శ్లో॥ యువాబ్దే మార్గశీర్షేచ ద్వితీయాయాం సితేగురౌ ।
శివసాన్నిధ్యమగమద్రామ లింగ ఇతిస్మరన్ ॥



అస్మత్ పరమ గురువులు
నిత్య కర్మానుష్ఠాన నిష్ఠాగరిష్ఠులు
కీ॥శే॥ బ్రహ్మశ్రీ జగర్లపూడి గోపాలకృష్ణ అవధానులు గారు.
(కనుమర్లపూడి) నర్సరావుపేట.

# పరమ గురు, పరమేష్ఠి గురు వందనం



పరమ గురువులు
"హరికథాకేసరి"
కీ॥శే॥ నేతి లక్ష్మీనారాయణ
భాగవతులు గారు, శ్రీమతి
సీతారామమ్మగారు.
విజయవాడ.



పరమేష్ఠి గురువులు
కవిసార్వభౌమ, సహజసాహిత్య
కోవిద, బహుభాషావేత్త,
నానావిధానేక సంస్కృతాంధ్ర కావ్య
నిర్మాతలు, సహస్రావధాన
ధురీణులు, హరికథా పితామహులు
కీ॥శే॥ శ్రీ మదజ్జాదిభట్ల
నారాయణదాసు గారు.
విజయనగరం.

# పుణ్యదంపతులు



కీ॥శే॥ మిట్టకంటి జగ్గారెడ్డి, కీ॥శే శ్రీమతి పద్మమ్మ.

(డా॥ మిట్టకంటి మధుసూదనరెడ్డి గారి తల్లిదండ్రులు.)

# నివేదన

ప్రస్తుత సమాజములో గురుముఖతః సాంప్రదాయికమైన రీతిలో నేర్చుకొని చేయించు యాజ్ఞికులు, అటులనే తగిన గ్రంథములు లభించక పోవుటచే శ్రాద్ధ సంబంధమైన విషయములన్నిటిని ఏర్చి కూర్చినానని శ్రీ గౌరవనీయులైన మిట్టకంటి మధు సూదన రెడ్డిగారితో వారి తల్లిగారైన పద్మమ్మ గారు పరమపదించినప్పుడు గరుడపురాణము చెప్పు తరుణమున ప్రస్తావించగా మాతల్లి దండ్రుల పుణ్యలోక ప్రాప్తికై నేను ఈ గ్రంథమును ముద్రించదలచితిని అని వారు చెప్పగా నేను సంతోషముతో ఈ గ్రంథమును సమగ్రముగా శ్రాద్ధ ధర్మములను ఏర్చి కూర్చి అత్యంత జాగరూకతతో దిద్ది తయారు చేసి ఇచ్చితిని. ఈగ్రంథము అతి త్వరలో వెలుగు చూచుటకు సహకరించిన శ్రీ మిట్టకంటి మధుసూదన రెడ్డిగారి కుటుంబమునకు ఆయురారోగ్య ఐశ్వర్యములను కల్పించు గాకయని శ్రీ పద్మావతీ వేంకటేశ్వర స్వామివారిని ప్రార్థిస్తూ వారితల్లి దండ్రులైన కీ॥శే॥ మిట్టకంటి జగ్గారెడ్డి, కీ॥శే శ్రీమతి పద్మమ్మ గార్లకు పుణ్యలోక ప్రాప్తి గలుగుగాక యనియూ భగవంతుని ప్రార్థించుచున్నాను.

అటులనే ఈ గ్రంథమునకు తగిన శోభకూర్చి, అన్నదాన మహిమ, సప్తవ్యాధ చరిత్ర విపులముగా అర్థసహితము వ్రాసి ఇచ్చిన డాక్టర్ బ్రహ్మశ్రీ విష్ణుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి సలక్షణ ఘనపాఠీ గార్కి నమోవాకములు అర్పించుచున్నాను. అటులనే మాకు తోడ్పాటునిచ్చి తమ అమూల్యాభిప్రాయములను ఇచ్చి, నిత్యము మమ్ము ఇట్టి సత్కార్యములకు ప్రోత్సాహాన్ని ఇస్తున్న కీసరగుట్ట వేదపాఠశాల ప్రిన్సిపల్ బ్రహ్మశ్రీ కె.యస్.యస్.అవధాని గార్కి, సహోద్యోగులూ అన్నగారైన బ్రహ్మశ్రీ యం.వి.యల్.యన్.శాస్త్రీగార్కి, శ్రీమాన్ కె.వి.యస్.వి.జి.శేషాచార్యులగార్కి సాష్టాశత ప్రణామములర్పించుచున్నాను. ఈ గ్రంథమును సుందరముగా తయారు చేసిన సుందర్‌గ్రాఫిక్స్ – చిరంజీవి కల్లూరు సుబ్రహ్మణ్య శర్మకు అభినందనలు తెలుపుచున్నాను.

ఇట్లు

మూర్తి వేంకటరామ శర్మ

# విన్నపము

మన సంస్కృతిలో వారసత్వాలలోని నిత్యవ్యవహారిక విలువలకు తోడుగా ఉన్న సార్వజనీన, సర్వకాలిక విలువలు మసకబారుతున్నాయి. పురాతన కాలంలో మానవుడికి స్వల్పమైన ఆత్మజ్ఞానం వుండేది. రానురాను చేస్తున్న వ్యవహారముల వలన కలిగే అనుభవాలద్వారా ఆత్మజ్ఞానం పెంచుకోవడం జరిగింది. ఆ ఆత్మజ్ఞానం వల్లనే తనని తాను సంస్కరించుకోవటం జరిగింది. ఆ సంస్కరణల ఫలితంగానే మానవుడు ఈ రోజు ఈ భౌతిక ప్రపంచాన్ని శాసిస్తున్నాడు. పారిశ్రామికీకరణ, టెక్నాలజి అభివృద్ధి వలన సర్వమానవ ప్రపంచం ఒకటయింది. ఒకరి కొకరు చేరువవటం జరిగింది. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని కాంక్షించవలసిన వ్యక్తి, యాంత్రికమైన జీవితానికి బానిసై, మానవతా విలువలు మరిచిపోతున్నాడు. యుగయుగాలుగా నిర్మించుకుంటూ వస్తున్న ఈ నాగరికతా సౌధాలు కూలిపోయే ప్రమాద స్థితి వస్తోంది. ఆటవికత పెరిగి, అరాచకాలు చూస్తూ ఆవేదన, అశాంతికి లోనవుతున్నాడు. సహనశీలత, నిజాయితీ, ప్రేమ, కారుణ్యం, గౌరవ మర్యాదలు రోజురోజుకూ అంతరించి పోతున్నాయి. ఇలా సంస్కృతి మూలాలే కదిలిపోతున్నప్పుడు జాతి భవిష్యత్తు మాటేమిటి? దీనికంతటికీ కారణం కుటుంబ వ్యవస్థ బీటలువారడమేనా? ఇంతటి నిరాశాపూరిత సంక్షోభ సమయంలో వివేకాన్ని, విచక్షణను, మానవతా, కుటుంబ విలువల్ని కాపాడుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఈసమస్య పరిష్కార మార్గంపై ఎందరో మేధావులు తమ దృష్టి సారించారు. పతనమైపోతున్న మన సంస్కృతి, విలువల పట్ల నేటి యువతలో జాగరూకత కలిగించి వాటి పట్ల అవగాహన పెంపొందించే అవసరం ఎంతైనా ఉందని చాలామంది అభిప్రాయ పడుతున్నారు. పశుపక్ష్యాదులలో లేని వివేకముండడం మానవునిలోని విశేషం. వివేకమంటే మంచి, చెడులమధ్య నున్న తేడాపాళ్లను గ్రహించగల శక్తి. ఆ వివేకానికి మూలం ధర్మం. అందువలన మానవుడంటే "ధర్మజీవి" అన్న నిర్వచనమున్నది. ధర్మమే మానవుడిని పశుత్వం నుంచి దివ్యత్వం వైపు నడిపించగలదు. మానవుడిని దేవతగా తీర్చి దిద్దడానికి ధర్మం సంస్కారాలను ప్రతిపాదించింది. వివిధ సంస్కారాలలో కూడిన సంస్కృతియే భారతీయ

సంస్కృతి. ఈ సంస్కారాల ప్రభావం వలన మనిషి ప్రకాశిస్తాడు.

నేటి యువతలో కుటుంబ వ్యవస్థ, తల్లితండ్రులు మరియు పెద్దల పట్ల గౌరవ మర్యాదలు పెంచి వారికి మన సనాతన ఆచారవ్యవహారములు, గతానుగతికముగాను, మూఢనమ్మకముతోను, యాంత్రికంగాను చేసేవికావని, చేసే ప్రతిపని వెనుక ఒక అర్థము పరమార్థములున్నాయని తెలియజేయడం మూలంగా పతనమవుతున్న విలువల పునరుద్ధరణ కొంతలో కొంతైన జరుగుతుందనే ఆశతో ఉన్న సమయంలో మహాశయులు బ్ర.శ్రీ.మార్తి వేంకట్రామ శర్మ గారితో పరిచయ భాగ్యము కలిగింది. వారు మన ఆచారాల ఆనుపానులను, ఆంతర్యాలను, అంతరార్థాలను అందరికి అందించాలన్న మహత్తర సంకల్పంతో ఆయాసంస్కారములకు సంబంధించిన గ్రంధాలను వెలువరించుటకు పూనుకున్న మహాశయులు. ప్రస్తుతము శ్రాద్ధ సంబంధమైన విషయములన్నిటిని ఏర్చికూర్చి గ్రంధము వ్రాయుచున్నానని తెలియజేయడంతో, అదే ఆశయంతో ఉన్న నేను వెంటనే ఈ గ్రంధ ముద్రణ భారాన్ని స్వీకరించాను. మాఈ ప్రయత్నము ఇంతటితో ఆగకుండా ఇంకా ముందు ముందు ఎన్నో సనాతన ధర్మాచారాలను తెలియజేసే గ్రంధాలను వెలువరించి... ప్రశాంత జీవనానికి దూరమౌతున్న మనిషి ఇంద్రియ, మనోనిగ్రహాల ద్వారా, అహంభావాన్ని వదిలి విజ్ఞతను పెంచుకోవాలని ఆత్మజ్ఞానానికై తన తెలివితేటలను జోడించి సామాజిక వికాసానికి తోడ్పడాలనే సంకల్పం కొంతలో కొంతైన నెరవేరగలదని చిరు ఆశతో ముందుకు సాగుతున్నాము. మా ఈ ప్రయత్నాన్ని అందరూ సాదరంగా స్వాగతిస్తారని ఆశిస్తూ.....

విధేయుడు

మిట్టకంటి మధుసూదనరెడ్డి

పాదుకోపానహౌ ఛత్రం (~~రక్తపుష్పా~~ రక్తవస్త్రం)ంబరాణిచ।
రక్తం పుష్పంచ మాత్రకం శ్రాద్ధభూమౌ వివర్జయేత్॥



ఆదౌ పితా తథా మాతా సాపత్నీ జననీ తథా
మాతామహాస్సపత్నీకాః ఆత్మ పత్న్యస్తదనంతరం
సుత భ్రాతృ పితృవ్యశ్చ మాతులాస్సహ భార్యకాః
దుహితా భగినీచైవ దౌహిత్రో భాగినేయకః
పితృష్వసా మాతృష్వసా జామాతా భావుకస్నుషా
శ్వశుర శ్యాలక స్సఖ్యః స్వామినో గురుశిష్యకః

# గ్రంథకర్త పరిచయము

| | | |
|---|---|---|
| 1. | పేరు | మార్తివేంకట్రామశర్మ |
| 2. | తల్లిదండ్రులు | మార్తి కోదండపాణి శాస్త్రి, రామలక్ష్మమ్మ |
| 3. | జననము | 12-06-1961 |
| 4. | విద్యాభ్యాసము | కృష్ణయజుర్వేద స్మార్తము, పూర్వాపరములు ఆపస్తంబ గృహ్యసూత్ర భాష్యము ఏకాగ్నికాండ మంత్రభాష్యము సాహిత్యము - సంస్కృత కావ్యములు. |
| 5. | వృత్తి | స్మార్తపండిట్, స్మార్తశాఖ అధ్యక్షులు శ్రీ వేంకటేశ్వర వేద సంస్కృత పాఠశాల కీసరగుట్ట-రంగారెడ్డి జిల్లా. |
| 6. | అనుభవము | స్మార్త కార్యములు చేయించుట రుద్రయాగాది యాగముల చేయించుట ధర్మశాస్త్ర పరిశీలన, 14సం॥లుగా ఉపాధ్యాయ వృత్తిలో అనేకమంది విద్యార్థులను పండితులుగా చేయుట. |
| 7. | రచనలు | ముద్రితములు:- యాజుషస్మార్త గ్రంథః పార్టు-1, పార్టు-2. సప్రయోగ ఆబ్దికమంత్రం - సప్రయోగ మహాలయ, మాసిశ్రాద్ధ ప్రకరణమ్. అముద్రితములు:- పంచదశ సంస్కారములు - సప్రయోగం. |
| 8. | హోదా | అధ్యక్షులు శ్రీ గాయత్రీబ్రాహ్మణ సాంస్కృతిక సేవాసంస్థ - దమ్మాయిగూడా |
| 9. | బిరుదులు | జ్యోతిష పరిషత్, సనాతన ధర్మ సంస్థలచే "పురోహిత సార్వభౌమ" "అధ్యాపక శిరోమణి" |
| 10. | అభిరుచి | స్మార్త గ్రంథముల సంకలనము. కర్మకాండల ఆవశ్యకత, మహిమల వివరణం, స్మార్త విద్యావ్యాప్తికి ధర్మవ్యాప్తికై కృషి చేయుట. |

# మున్నుడి

శ్లో॥ కాండ ద్వయోప పాద్యాయ కర్మబ్రహ్మ స్వరూపిణే ।
స్వర్గాప వర్గ రూపాయ యజ్ఞేశాయ నమోనమః ॥

భక్త మహాశయులారా! మనది కర్మభూమి. ఈ కర్మ భూమిలో అనేక మంది సత్కర్మాచరణచే భగవదను గ్రహమును పొందిరి. అట్టి కర్మలు మూడు విధములుగా ఉన్నవి. 1.నిత్య, 2.నైమిత్తిక, 3.కామ్య కర్మలు. ఇందు నిత్య కర్మలనగా సంధ్యావందన, అగ్నిహోత్ర, వైశ్వదేవ, బ్రహ్మయజ్ఞ, అతిథి పూజాదులు. నైమిత్తికములు అనగా ఒక నిమిత్తమును గూర్చి చేయునవి. దర్శశ్రాద్ధాదులు, ప్రత్యాబ్దికములు, సంక్రాంతులు, వ్రతాదులు మున్నగునవి. ఇక కామ్య కర్మలనగా అనిష్ట పరిహారముగా ఇష్ట ప్రాప్తికై ఆచరించెడి శాంతి, పౌష్టిక కర్మలు.

ఈ కర్మలలో పితృదేవతల నారాధించెడి కర్మలను శ్రాద్ధములు అందురు. "శ్రద్ధయా అనేనేతి శ్రాద్ధమ్" – అనగా అత్యంత శ్రద్ధాభక్తులచే చేయ తగిన కర్మ అని అర్థము. దేవతా పూజలకంటే ఎక్కువ శ్రద్ధగాశుచిగా, మడిగా ఆచరించ దగినవి పితృకర్మలు. కారణమేమనగా దేవతా పూజలు భక్తులందరూ చేయుదురు – కానీ, మన పితరుల నుద్దేశించి చేయదగు కర్మలు మనమే చేయవలెను – ఇతరులు చేయరు.

కావున శ్రద్ధ అనెడిది శ్రాద్ధములందు అత్యావశ్యకము అయి ఉన్నది. ఈ శ్రాద్ధ కర్మలు బహువిధములుగా ఉన్నవి. ఉదా:– నిత్యశ్రాద్ధము, షణ్ణవతి శ్రాద్ధములు, ప్రత్యాబ్దిక శ్రాద్ధములు, కామ్య శ్రాద్ధములు – నాందీ శ్రాద్ధములు – గ్రహణ శ్రాద్ధము నిత్యశ్రాద్ధమనగా నిత్యము ఒక బ్రాహ్మణునికి పితృదేవతారూపమున అర్చించి భోజనము పెట్టి తర్పణ చేయుట దీనిలో తిలలు, ప్రాచీనావీతము అపేక్షితములు గావు. బ్రహ్మచర్య అధశ్శయ్యాది నియమరహితమైనది.

**శ్లో॥ అమామను యుగ క్రాంతి ధృతి పాత మహాలయాః ।**
**తిస్రోష్టకాశ్చ విజ్ఞేయా షణ్ణవత్యః ప్రకీర్తితాః ॥**

అమావాస్యలు 12, మన్వాదులు 14, యుగాదులు 4, సంక్రాంతులు 12, వైధృతులు 13, వ్యతీపాత్‌లు 13, మహాలయములు 16,అష్టకాన్వష్టకములు = 96 ఇవిషణ్ణవతి శ్రాద్ధములనబడును.

ప్రత్యాబ్దికమనగా అబ్దే అబ్దే ప్రత్యబ్దమ్, అనగా మృతాహస్సునందు జరుపబడు శ్రాద్ధము. కామ్య శ్రాద్ధములు గూడా కొన్ని, ధర్మ శాస్త్రములందు కన్పట్టుచున్నవి. లోకవ్యవహారమున ఆచరించు వారు కనుపడుటలేదు. కోర్కెతో చేయు శ్రాద్ధము అని అర్థము నాందీ శ్రాద్ధములనగా శుభకార్యములయందును సమస్త గృహ్యాకర్మలయందునూ ఆచరించతగినవి.

**శ్లో॥ అనస్మద్వృద్ధ శబ్దానాం, అరూపాణాం, అగోత్రిణాం ।**
**అనామ్నా మతి లాద్యైశ్చ నాందీ శ్రాద్ధం విధీయతే ॥**

అనగా అస్మత్, వృద్ధ ప్రపితామహ అనెడి వృద్ధ శబ్దములు, వస్త్రాది రూపములు, గోత్ర వివరణము, నామోచ్చారణ, తిలలు, ఇట్టివి లేకుండా హరిద్రాక్షతలతో, ప్రాచీనావీతము లేకుండా 1.విశ్వేదేవతలను, 2.మాతృ, 3.పితృ దేవతలనూ, 4.మాతామహులను అర్చించవలెను ఇది నాందీ శ్రాద్ధవిధి ఆంధ్ర దేశమున ఇది హిరణ్యదాన రూపముగా ఆచరించుచున్నారు. ద్రవిడ దేశమున ఇప్పటికీ శుభకార్యములకు ముందుగా ఇది యథావిధిగా కొందరు ఆచరించుట గోచరించుచున్నది. ఇక సూర్య చంద్ర గ్రహణముల యందు చేయవలసిన శ్రాద్ధము గ్రహణ శ్రాద్ధమనబడును.

**శ్లో॥ గ్రస్యమానే భవేత్స్నానం, గ్రస్తేహోమోర్క చంద్రయోః ।**
**ముచ్యమానే భవేద్దానం (శ్చ్రాద్ధం) ముక్తౌస్నానం విధీయతే ॥**

గ్రహణ కాలమున ముందు స్నానము – జపము, హోమము, శ్రాద్ధము, దానము, స్నానము క్రమముగా ఆచరింపవలెను.

**జ్ఞాత్వా కర్మాణి కుర్వీత** యని పెద్దలమాట కావున పై విషయములను తెలుసుకొని శ్రద్ధగా ఆచరించుటచే పితరులకు ముక్తి కలిగించుటయేగాక మనము కృత కృత్యులమై పుత్రత్వ సిద్ధిని బొంది పితృదేవతానుగ్రహముచే సకల శ్రేయస్సులను పొందగలము.

## శ్రాద్ధ విహితములు - త్యాగములు - ధర్మములు

శుచిత్వము గలిగిన, మంత్రవేత్తలైన యోగ్యులైన బ్రాహ్మణులను ఆబ్దికాదులయందు భోక్తలుగా నిమంత్రించవలెను. మేనల్లుళ్ళు, భావమరదులు ఇటివంటి యోని సంబంధీకులుగానీ మంత్ర సంబంధీకులుగానీ, (శిష్యులు) భోక్తలకు పనికిరారు. మరియూ సగోత్రీకులనుగూడా భోక్తగా నియమించ రాదు - అభావ పక్షములో విశ్వేదేవస్థానమందు నియమింప వచ్చును. నిత్య శ్రాద్ధమందునూ, గయా శ్రాద్ధమందునూ, సోదకుంభ శ్రాద్ధములందునూ, సగోత్రుని నియమించ వచ్చునని బృహస్పతి వాక్యము. భార్య రజస్వల అయిన కాలములోనూ, ఆరవ మాసమునిండిన గర్భవతి భర్తయూ, శ్రాద్ధ భోక్తలుగా ఉండుటకు అర్హులుగారు. సాధారణముగా బ్రాహ్మణ శోధన చేయకూడదు. విశేష ధర్మమేమనగా పితృకర్మలందు బ్రాహ్మణులను పరిశీలించి యోగ్యులనే నియమించుకొన వలెను. తీర్థ క్షేత్రముల యందు చేయు శ్రాద్ధములందు తీర్థవాసులను నియమించవలెను - వారిని శోధించ నక్కర లేదని స్కాంద పురాణ వచనము. భోక్తలను నిమన్త్రించు నప్పుడు బ్రాహ్మణుని కుడిపాదమును స్పృశించి నిమంత్రించవలెను. క్షత్రియులు ఎడమపాదమును స్పృశించియూ, వైశ్యులు రెండు పాదములు పట్టుకొనియూ, శూద్రులు ప్రార్థనా పూర్వకముగాను బ్రాహ్మణులను నిమంత్రించు కోవలెను. విశ్వేదేవులు లేకుండా శ్రాద్ధము జరిపినచో, పిశాచ, రాక్షస, యక్ష, భూతములూ శ్రాద్ధమును నష్టపరుచుదురు. కావుననే విశ్వేదేవతలను పూజించుట శ్రాద్ధములందు విధించబడినది.

## కర్తృ నియమములు

శ్రాద్ధకర్త తద్దినము రోజుననూ, పూర్వాపర దినములందునూ పరాన్నమును

స్వీకరింపరాదు. స్వీకరించినచో పితృ ఘాతకుడగును. శ్రాద్ధదినమున కర్త, దంత ధావనము, (కాష్ఠాదులతో) తాంబూల చర్వణము, క్షౌరము, అభ్యంగనము, స్త్రీ సాంగత్యము, ఔషధ సేవనము, అల్పాహారము చేయుట పరాన్నము, అని ఈ ఎనిమిది పనులు చేయరాదు. శ్రాద్ధ దినమున ఘంటానాదము చేయుట, రుద్రాక్షధారణ పనికిరాదు - మరియు కర్తగానీ, భోక్తగానీ, ఒక్క వస్త్రముతో నుండరాదు. విధిగా ఉత్తరీయమును ధరించవలెను. మరియూ శ్రాద్ధమునకు ముందుగా, దానములు చేయుట, అధ్యయనమును చేయుట విశేష దేవతారాధనలు, జపములు, హోమములు, వ్రతానుష్ఠానములు, భిక్షువులకు ఆహారమిచ్చుట మొదలగునవి పనికిరావు. మరియూ, మరణవార్త విన్ననూ, పుత్రజనన మైనప్పుడు సంక్రమణముల యందునూ, శాద్ధ దినములందునూ, పర్వదినములందునూ (గ్రహణాదులు) చండాల, ఆశౌచముగల వారిని స్పృశించిననూ, వేడినీటి స్నానము చేయరాదు - చన్నీటి స్నానము చేయవలెను - తెలిసియూ, అనారోగ్యాది నిమిత్తములు లేకుండానూ వేడి నీటిస్నానము చేసినచో గోహత్యా పాతకములు కల్గునని స్మృతి వచనము. గోధుమ, పెసర, మినుము, నూనె, నెయ్యి మొదలైన పదార్థములు లేకుండా ఆబ్దికము పెట్టి ననూ నిరర్థకమేయగును. కావున ఆవస్తువులను ఆబ్దికము నందు విశేషముగా ఉపయోగించవలెను. తలిదండ్రులకు జీవించి ఉండగా ఇష్టమైన యోగ్యపదార్థములను శ్రాద్ధముల యందు ప్రయత్న పూర్వకముగా ఉపయోగించవలెను.

## భోక్తృ ధర్మములు

శ్రాద్ధము నందు నిమంత్రితుడైన భోక్త, కర్తయూ, స్త్రీసంగము చేయరాదు. ఆనియమమును ఉల్లంఘించినచో పితృదేవతలు ఆరు మాసములు రేత భోజనము చేయవలసి వచ్చును - ఒక శ్రాద్ధమునందు నిమంత్రితుడైన భోక్త ఆశ్రాద్ధమునకు గాక, వేరొక చోటకి భోజనమునకు వెళ్ళినచో అట్టి భోక్త నూరు నరకములననుభవించి, చండాల జన్మనొందగలడు. శ్రాద్ధభోక్త, మరల భోజనము చేయుట అరణ్య సంచారము, బరువులెత్తుట, వేదాధ్యయనము చేయుట, రతిక్రియ సల్పుట, సంధ్యావందనములో దశాధికముగా గాయత్రీ

జపము, వేరొక చోట ప్రతిగ్రహణము, హోమములు చేయుట (ఔపాసన) పనికి రాదు –

ప్రత్యాబ్దిక భోక్త ఒక రోజులో పవిత్రుడగును.

మాసికములయందు ఆరు రోజులలో పవిత్రుడగును.

ఉనషాణ్మాసిక, సంపిండీకరణ, ఏకోద్దిష్ట శ్రాద్ధ భోక్త 1 సంవత్సరమునకు శుద్ధుడగును.

శ్రాద్ధ పాకమున వంకాయ, సొరకాయ, గోంగూర, మునగతోపాటు టమోటా, క్యాబేజీ, కేలీ ఫ్లవర్, బీట్‌రూట్, కేరట్, ఆలుగడ్డ వంటి ఆధునిక కూరగాయలూ వర్జనీయములే.

ప్రత్యాబ్దికమున భూరి భోజనము పెట్టవలనని శాస్త్రవచనము, అనగా శ్రాద్ధ పాకముగాక వేరేవంట చేయించి శ్రాద్ధము అయిన పిమ్మట భోజనము పెట్టించవలెను – శ్రాద్ధ పాకము (పితృశేషము) జ్ఞాతులు, బంధువులకే పరిమితము. స్నేహితుని ఇంటనూ, గురువుగారి ఇంటనూ, మేనమామ ఇంటి యందును, సోదరీ, మామగారి ఇంటభోజనము చేసిననూ పరాన్నము గాదని పెద్దల వచనము.

# శ్రాద్ధ ధర్మములు

ఈ కలి యుగమున శాస్త్రీయముగు కర్మలను ఆచరించుట బహుదుర్లభముగా ఉన్నది. ప్రత్యాబ్దికము పెట్టుటకు (వంట చేసిపెట్టుటకు) వసతి కుదరకపోతే అమశ్రాద్ధము అనగా బియ్యం, పచ్చికూరలు, పప్పుదినుసులు మొదలగు వస్తువులను ఇచ్చి శ్రాద్ధము జరుపుట యుక్తము – వస్తువులు లభించని సందర్భములోనే హిరణ్య శ్రాద్ధము (బంగారము గానీ, డబ్బుతోగానీ శ్రాద్ధము జరుపుట) చేయవలెను. సదుపాయములన్నీ ఉండి చేయుటకు అశక్తుడగుచో సంకల్పవిధిగా భోజనము పెట్టి చేయునది సంకల్ప శ్రాద్ధమనబడును – ఏ వసతీ కుదరని పక్షములోనే తిల తర్పణగావించి పితృదేవతలను తృప్తులను చేయవలెను. ఆ తిలలు సంపాదించుటకు గూడా అశక్తుడై (దరిద్రుడైనచో) ఊరి వెలుపలకు వెళ్ళి

చేతులు పైకి చాచి ఓ పితృదేవతలారా! నేను దారిద్ర్యపీడితుడనై ఆహారము లేక శుష్కించు చున్నాను నాకన్నీటిని మీరు స్వీకరించి తృప్తులగుదురుగాకయని రోదించ వలెను - పైవేవీ ఆచరించక శ్రాద్ధ త్యాగము చేసినవాడు జీవనీయుదు గాదని స్కాందపురాణము చెప్పుచున్నది.

**శ్లో ॥ ధనవంత మదాతారం, దరిద్రమత పస్వినమ్ ।**
**ద్వావంభసి నివేష్ట వ్యౌ, కంఠే బధ్వా దృఢాంశిలాం ॥**

ధనవంతుడై ధర్మ కర్మాచరణ చేయకున్ననూ, దరిద్రుడై తపో, జప, భగవన్నామ స్మరణ రహితుడైననూ, కర్మ, ధర్మ భ్రష్టులను మెడలో బండరాయి గట్టి నీటిలో పడవేయ వలెనని భావము.

**సర్వజనాస్సుఖినో భవంతు. సర్వేషాంసమస్త సన్మాంగళాని సంతు**

ఇట్లు
సుధీవిధేయుడు
మూర్తి వేంకటరామ శర్మ
23-9-2004

☆☆☆

# విషయ సూచిక

# శ్రీరామలింగాష్టకము

శ్లో ॥ శుద్ధజ్ఞాన ప్రదో నిత్య ఐహికాముష్మికార్థదః ।
భవానీ సహితో దేవో రామలింగోఽభిరక్షతు ॥

శ్లో ॥ రామలింగ ప్రభుం వందే జగత్కారణ కారణమ్ ।
త్రిపురాసుర హంతారం భక్త కల్పమహీరుహమ్ ॥

శ్లో ॥ హే! రామలింగ! హేనాథ! తాపత్రయ నివారక ।
కామక్రోధాది సంతప్తం రక్షమాం భవసాగరాత్ ॥

శ్లో ॥ ప్రతిష్ఠితోహి యోదేవస్సీతా రామేణ ధీమతా ।
కేసరాద్రౌ విజయతే భవానీ సహిత శ్శివః ॥

శ్లో ॥ మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే ।
శుద్ధస్ఫటిక వర్ణాయ రామలింగాయతే నమః ॥

శ్లో ॥ ప్రతిష్ఠితోసి రామేణ పూజితోసి సురైరపి ।
తథైవ ద్విజవర్యైశ్చ అర్చితోసి సదాప్రభో ॥

శ్లో ॥ హృత్పుండరీక మధ్యస్థో భూతానాంచ హితే రతః ।
నిత్యముక్తో జగత్సా క్షీ పాలయత్వనిశం మృడః ॥

శ్లో ॥ భస్మాను లిప్త సర్వాంగ కరుణాకర శంకర ।
స్వీకురుష్వ స్తుతిమిమాం భక్త్యా ప్రథమతోర్పితామ్ ॥

## ఫలశృతిః

రామలింగాష్టక స్తోత్రం యః పఠేద్భక్తి మాన్నరః ।
స సర్వపాప నిర్ముక్తో దుర్గభాం గతి మాప్నుయాత్ ॥

ఇతి మార్తి వేంకట్రామశర్మణా విరచిత శ్రీరామలింగాష్టకం సంపూర్ణం

డా॥ విష్ణుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి (M.A. Ph.D)
ప్రాచార్యః
వేదభాష్యవిజ్ఞాన పరిశోధనాకేంద్రం
వేదభవనం - సికింద్రాబాద్.

# శ్రాద్ధమహిమ

లోకములో మానవులపాప నివృత్తి కొరకు శాస్త్రములు అనేక విధకర్మలను బోధించినవి. అట్టికర్మలలో నైమిత్తిక కర్మలు నిత్యకర్మలవలే పాపక్షయకారణములని శాస్త్ర మర్యాద. ఒక నిమిత్తమును ఆధారముగ చేసుకుని చేయవలసిన కర్మలు కనుక ఆ కర్మలను నైమిత్తిక కర్మలందురు అట్టి కర్మలలో శ్రాద్ధకర్మలు ప్రాముఖ్యమును చెందియున్నవి. లోకములో శ్రాద్ధ కర్మల పట్ల రానురాను శ్రద్ధ సన్నగిల్లి ఆచరణలుప్తమగుచున్నట్లు కనపడుచున్నది. ఇట్టి స్థితిలో శ్రాద్ధమహిమను సోపాఖ్యానముగ వివరించినచో లోకములో ఆస్తికత్వమునకు పునరుజ్జీవనము లభించుననియు, లోకము శ్రాద్ధకర్మలను శ్రద్ధతో ఆచరించి పితృదేవతానుగ్రహమునకు పాత్రులై సమస్త శ్రేయస్సులను పొందగలరని శ్రాద్ధమహిమ ఇచట వివరించబడుచున్నది.

"శ్రద్ధయాదీయత ఇతి" శ్రాద్ధం అను వ్యుత్పత్తి ప్రకారము శ్రాద్ధకర్మ శ్రద్ధాతిశయముచే చేయతగినదైయున్నది. శ్రాద్ధములు అనేకవిధములుగా ఉన్ననూ వానిలో ప్రత్యాబ్దికము అవశ్యాచరణీయము ప్రత్యాబ్దికమనగా ప్రతి సంవత్సరము చేయతగినది అంతేకాదు ప్రతినిత్యము శ్రాద్ధాచరణ మున్నట్లు మనుస్మృతిలో మనుమహర్షి ఈ శ్లోకములో ఇట్లు ప్రబోధించిరి।

**శ్లో॥ కుర్యాదహరహశ్శ్రాద్ధం అన్నాద్యేనోదకేనవా ।**
**పయోమూల ఫలైర్వాపి పితృభ్యఃప్రీతిమావహన్ ॥** -మ॥ స్మృ. 3-82

గృహస్థు ప్రతిదినము పితృదేవతల ప్రీతికొరకు అన్నము ఉదకము, పాలు, దుంపలు, ఫలములు, తిలలు, వ్రీహులు మున్నగు పదార్థములచేత శ్రాద్ధమాచరించవలయును.

శ్రాద్ధాచరణవిషయములో విశ్వేదేవతలు సాక్షిగా ఉందురు. శ్రీమహావిష్ణువు శ్రాద్ధమునకు పర్యవేక్షకులుగా ఉండును. ప్రధానదేవతలు పితృదేవతలు వీరు ముగ్గురు. తండ్రి, తాత, ముత్తాత, తండ్రి వసుస్వరూపుడు, తాత రుద్రస్వరూపుడు, ముత్తాత ఆదిత్యస్వరూపుడు. ఈ ముగ్గురు వసు, రుద్ర, ఆదిత్యలోకములయందు ఉందురని, శాస్త్రసంప్రదాయము. ఒకానొకప్పుడు ఈ ముగ్గురు వారి కర్మఫలాను భవానంతరము ఆలోకములను విడిచి కర్మానుగుణముగ మరోలోకములో ప్రవేశించి ఉండవచ్చును, కాని వారు ప్రవేశించిన లోకములు వారి స్థితి వసురుద్రాదిత్య లోకముల యందే తెలియబడును.

శ్రాద్ధాచరణ విషయములో ఒకానొకస్థితిలో భోక్తలగు బ్రాహ్మణులు లభించనిచో శ్రాద్ధకర్త అరణ్యమునకు వెళ్లి పెద్దగా పితృదేవతలను పిలిచినాకు బ్రాహ్మణులు లభించలేదు శ్రాద్ధము ఆచరించలేక పోవుచున్నాను అని పెద్దగా ఏడవవలెను. మరియు శ్రాద్ధాచరణ విషయములో ఇట్లుండవలెను. భోక్తలు తమ భోజనకాలములో కర్తలు తమకొరకు వండిన భక్ష్యాది పదార్థములలో అపేక్షిత పదార్థములను అడిగి స్వీకరించి భుజించవలెను. ఆయా భక్ష్యపదార్థములు భుజించవలెనని ఉన్ననూ సిగ్గుతో అడగలేక భక్షించలేకపోయినచో ఆదోషము భోక్తలదే। అయిననూ కర్త మాటిమాటికి భక్ష్యపదార్థములను అడిగివేయనిచో ఆదోషము కర్తదేయగును.

శ్రాద్ధాచరణ విషయములో కొన్ని రహస్యములు తెలుసుకోతగినవి ఉన్నవి। శ్రాద్ధము అనుష్ఠింపబడుచుండగ విశ్వేదేవతలు వసురుద్రఆదిత్య లోకములకు వెళ్లి అచట ఉన్న పితృదేవతలతో ఇట్లు చెప్పెదరు । ఓ పితృదేవతలారా? భూలోకములో మీ పుత్రపౌత్రాదులు మీ కొరకు శ్రాద్ధము ఆచరించుచున్నారు, అని చెప్పెదరు. ఆ సమయములో పితృదేవతలు ఆ లోకములోనే ఉన్నచో భూలోకములో పితృదేవతా స్వరూపముతో భుజించుచున్న బ్రాహ్మణుల భోజనతృప్తిని అనుసరించి పితృదేవతలు తృప్తి చెందగలరు. ఒకవేళ పితృదేవతలు ఆలోకములో లేక లోకాన్తరములో ఉన్నచో వారెచట ఉన్నది వసురుద్రాదిత్య లోకములో విచారించి విశ్వేదేవతలు వారేలోకములో ఉండిరో ఆలోకములో వారికి శ్రాద్ధకర్త సమర్పించిన పిండము మున్నగు ఆహారములను సంక్రమింపచేసెదరు, ఇచట ఒకరహస్యము తెలియతగినది. ప్రస్తుతము పితృదేవతలు ఏలోకములో ఉండిరో ఆలోకవాసులు ఏ ఆహారముతిందురో ఆవిధమయిన ఆహారముగ కర్త ఇచ్చిన పిండాది

అన్నము మున్నగు పదార్థములను మార్చి పితృదేవతలకు చెందునట్లు చేసెదరు। అదెట్లనగ పితృదేవతలు పుణ్యవశమున దేవతాలోకములో ఉన్నచో అప్పుడు భూలోకములోకర్త ఇచ్చిన పిండాది అన్న విశేషములను విశ్వేదేవతలు దేవతలకు ఆహారమయిన అమృతస్వరూపముగా మార్చి అందించగలరు. ఒకవేళ పితృదేవతలు పాపవశమున రాక్షసలోకములో ఉన్నచో అప్పుడు కర్త ఇచ్చిన పిండాది అన్న విశేషములను రాక్షసులకు ఆహారమయిన మాంసమునెత్తురుగా మార్చి భుజింపచేయగలరు। ఒకవేళ పితృదేవతలు భూలోకములో పశుస్వరూపముగ ఉన్నచో అప్పుడు కర్త ఇచ్చిన పిండాది అన్న విశేషములను విశ్వేదేవతలు లేత పచ్చగడ్డి మున్నగు పశువులకు యోగ్యమగు ఆహారముగ మార్చి సమర్పించగలరు.

శ్రాద్ధ విషయములో ఒక ఉపాఖ్యానము భరద్వాజ మహర్షికి ఏడుగురు పుత్రులున్నారు, వారు గురుకులమందు విద్యనభ్యసించుచుండెడివారు। ఒకానొక రోజున గురువుగారి గోవును మేపుటకై అరణ్యమునకు తీసుకెళ్లిరి. అచట శిష్యులకు ఆకలి కలిగినది. ఆకలి బాధకు ఓర్వలేక ఆగోవును భక్షించుటకు సిద్ధపడిరి। కాని గోవును భక్షించుట యుక్తమా అయుక్తమా? అని సందేహము కలిగినది। కృతాది యుగములలో ధర్మతారతమ్యమును అనుసరించి శ్రాద్ధకాలములో గోమాంసము పితృదేవతలకు సమర్పించుటను ధర్మశాస్త్ర కర్తలు అంగీకరించిరి। కాని స్వేచ్ఛగా స్వోదరపూరణకొరకు మాంసభక్షణము నిషిద్ధమైయున్నది కలియుగములో శ్రాద్ధాదులయందుకూడ మాంసవినియోగము నిషిద్ధమే. కలియుగములో స్వోదరపూరణకొరకు నిషిద్ధమని వేరేచెప్పనేల? ఆ ఏడుగురిలో జ్యేష్ఠుడు మొదలగు 4గురు ప్రథమసోదరులు ఉదరపూరణకొరకు గోవును భక్షించవచ్చని నిర్ణయించిరి। కాని మిగిలిన చివరి సోదరులు ముగ్గురు గోవును స్వోదరపూరణకొరకు భక్షించుట తగదని చెప్పిరి. జ్యేష్ఠాది నలుగురు సోదరులు వారి నిర్ణయప్రకారము గోవును భక్షించుటకే ప్రయత్నించిరి। ఇంతలో ఏడవ సోదరుడు మాంసము స్వోదర పూరణకొరకు భక్షించుట తగదు ఒకవేళ భక్షించవలసినచో గోమాంసములో కొంతభాగమును మూడుపిండములుగా చేసి శ్రాద్ధములో పితృదేవతలకిచ్చి మిగిలిన మాంసమును తినవలెనని ప్రబోధించెను. ఇట్లు భరద్వాజపుత్రులలో అభిప్రాయభేదములున్నను క్షుద్బాధను భరించలేక గోమాంసమును పితృదేవతలకు సమర్పించి భక్షించిరి। సాయంకాలము గురువుగారి ఇంటికి దూడను ఒక దానినే

తీసుకువెళ్లిరి । అంతగురువు గోవు ఏది? అని అడుగగా అరణ్యములో క్రూరమృగములచే భక్షింపబడినది అని అబద్ధము చెప్పిరి । గురు గోద్రవ్య భక్షణ పాపము, గోహత్యాపాతకము, గురువునకు అబద్ధముచెప్పిన పాపము ఈ మూడుదోషములచేత ఈ భరద్వాజపుత్రులు ఏడుగురు సోదరులు ఒకేసారి మరణించి దశార్ణదేశములో ఒక వ్యాధునకు పుత్రులై జన్మించిరి. వీరు గోమాంసమును భక్షించినప్పటికి గోమాంసమును పితృదేవతలకు సమర్పించి భక్షించుటచేత ఆ పుణ్యమువలన వీరికి పూర్వజన్మస్మృతి లభించినది । అంతేకాదు రాబోవు మూడు జన్మలవరకు పూర్వజన్మ స్మరణ లభించగలదు అందుచేతనే వారు ఈ జన్మలో వ్యాధులయిననూ పూర్వజన్మలో బ్రాహ్మణులై ఉండుట చేత బ్రాహ్మణధర్మములనే అనుసరించుచుండెడివారు మరియు వ్యాధ ధర్మములయిన హింసాదులను పరిత్యజించి అహింసా పూర్వకముగ తల్లిదండ్రులను ఎల్లప్పుడు సేవించుచుండెడి వారు. ఆ జన్మలో కాలధర్మము చేసినతరువాత 7గురు సోదరులు కాలాంజన పర్వతమందు లేడిజన్మపొందిరి. లేడి జన్మలో కూడ పూర్వజన్మస్మృతి ఉన్నది. పూర్వజన్మలో స్వోదరపూరణకొరకు గోమాంసభక్షణ చేసిన పాపమును స్మరించుచు చింతాక్రాన్తులై భగవధ్యానముతో కాలము గడిపిరి తరువాత జన్మమూడవ జన్మ. ఆ జన్మలో శరద్వీపములో చక్రవాకపక్షులై జన్మించిరి. ఈ జన్మలోకూడ పూర్వజన్మలలోవలె పూర్వజన్మస్మరణ పాపస్మరణ భగవత్స్మరణలు ఉన్నవి । నాలుగవ జన్మలో 7గురు సోదరులు మానససరోవరమందు హంసలై జన్మించిరి. ఈ జన్మలోకూడా పూర్వ జన్మస్మృతి, పాపచింత, భగవచ్చింతనము పూర్వజన్మలోవలె ఉన్నవి. ఒకానొకరోజున బాభ్రవ్యమహారాజు రాణితో మంత్రులతో కలసి క్రీడార్థమై హంస సోదరులున్న సరస్సువద్దకు వచ్చిరి. అచట రాణీరాజులు క్రీడించుచుండగ హంససోదరులు వారిని చూచిరి అందులో సప్తమ (7) హంస సోదరుడు క్రీడించుచున్న రాజదంపతులను చూచి ఓ సోదరహంసలారా? రాజభోగము ఎంత గొప్పది. నాకు మరో జన్మ ఉన్నచో ఆ జన్మరాజజన్మ అయినచో బాగుండును అని చెప్పెను । అతని కోరికను విన్న హంస సోదరులు ఆరుగురు అట్లే రాజజన్మపొందమని 7వ హంస సోదరుని శపించిరి । అంత 7 వ హంస సోదరుడు ఓ సోదరులారా? మీరు లేకుండగ నేనొక్కడిని రాజభోగములను అనుభవించుట తగినపనికాదని తెలిసికూడ సర్వసాధారణముగ అట్లుపలికితిని అని చెప్పి గట్టిగా ఏడ్చెను.

అంతలో జ్యేష్ఠుడు మొదలగు 4గురు హంససోదరులు తమతరువాత సోదరులతో ఇట్లనిరి । రాజుగా జన్మించబోవు సప్తమసోదరునకు మీరిద్దరు మంత్రిగా పురోహితులుగా జన్మించండి । అప్పుడు సప్తమసోదరునకు సోదరులతో వియోగ దుఃఖముండదు మీ ముగ్గురు రాజ మంత్రిపురోహితులుగా జన్మించుగాక అని ముగ్గురిని శపించిరి. రాజభోగములపై అభిలాష కలుగుట వలన సోదరుల శాపమువలన ముగ్గురు హంస సోదరులకు పూర్వ జన్మ స్మృతి నశించినది. ఈ ముగ్గురు హంససోదరులు భరద్వాజపుత్రులుగా ఉన్నప్పుడు గోమాంసభక్షణ కూడదని నిషేధించినవారు సప్తమ సోదరుడు మాత్రము అట్టి అకృత్యమునకు పాల్పడతలచినచో గోమాంసమును మూడుపిండములుగా చేసి పితృదేవతలకిచ్చి మిగిలిన మాంసమును తినవలెను అని చెప్పిగొప్ప పుణ్యమును సంపాదించినవాడే కాని ఆపుణ్యము హంసజన్మలో ఉండగ రాజభోగాభిలాషవలన నశించినది. ఈ విధముగ మొదటి నలుగురు హంససోదరుల శాపప్రకారము చివరి ముగ్గురు హంససోదరులు రాజమంత్రి పురోహితులుగ జన్మించిరి. మొదటి నలుగురు హంససోదరులు కురుక్షేత్రములో దరిద్ర బ్రాహ్మణగృహమందు బ్రాహ్మణులై జన్మించిరి । మొదటి నలుగురు సోదరులు భరద్వాజపుత్రులుగా ఉన్నప్పుడు గోవధచేసి మాంసముతిన్న మహాపాపులే కాని హంసలుగా ఉన్నప్పుడు జలక్రీడలో ఉన్న రాజదంపతులను చూచి కూడ సప్తమసోదరుని వలే రాజభోగవాంఛ వీరికి కలగలేదు । అంతేకాదు సప్తమహంస సోదరునకు కలిగిన రాజభోగవాంఛను నిందించినవారు అందుచేతనే మొదటి నలుగురు హంససోదరులకు ఉత్తమమయిన దరిద్ర బ్రాహ్మణజన్మ లభించినది. ఈ జన్మచరమజన్మ ఈ విషయములో భగవద్గీతలో ఈ శ్లోకార్థమును చూదుదు.

**శ్లో ॥ అథవాయోగి నామేవకులె భవతి ధీమతాం ।**
**ఏతద్ధిదుర్ల భతరంలోకే జన్మయదీదృ శం ॥** - భ.గీ.6-42

యోగ భ్రష్టునకు ఏలోకములు లభించును అను ప్రసంగములో చెప్పబడిన రెండువిధానములలో రెండవ విధానమునకు చెందినది ఈ శ్లోకము । యోగమునుండి భ్రష్టుడయిననూ యోగముమహా పుణ్యమయినది కనుక కామనా దోషములేని పక్షములో బ్రహ్మవేత్తలయిన దరిద్రబ్రాహ్మణగృహమందు జన్మలభించును । ఇట్టి జన్మ లభించుట మిక్కిలి దుర్లభము. కారణమేమనగా ఈ జన్మలోనే మోక్షము లభించును మోక్ష ప్రదజన్మలభించుట కష్టముకదా? ఈ జన్మలో ఈ నలుగురు సోదరులకు పూర్వ జన్మస్మృతి

ఉన్నది । వీరు వేదవేదాంగములన్నియు స్మరణమాత్రముచేతనే పొందిరి। వైరాగ్యము, శమాదిషట్కము బ్రహ్మజ్ఞానము వీరికి ప్రాప్తించినవి । అందుచేతనే ´ సమయములో ఈ నలుగురు సోదరులు మహా ప్రస్థానము చేయతలచి తల్లితండ్రులను అనుమతికోరిరి । అంతతల్లి తండ్రులిట్లనిరి ఓ పుత్రులారా! మీరు మాకు శుశ్రూష చేయవలయును మేము మరణించిన తరువాత శ్రాద్ధకర్మ చేయవలయును కనుక మీరు మా సమీపమందే ఉండండి వెళ్లవద్దని చెప్పిరి. అపుడు ఆనలుగురు సోదరులు తల్లితండ్రులతో ఇట్లనిరి, మా వద్ద ధనములేదు శ్రాద్ధకర్మకు ధనము ఆవశ్యకము మీ వద్దకూడ ధనములేదు మీకు ధనము ఇప్పించి మేము మహాప్రస్థానము చేసెదము అని చెప్పి ఈ రెండు శ్లోకములను వ్రాసి ఇచ్చిరి.

**శ్లో॥ సప్తవ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజనే గిరౌ ।**
**చక్రవాకాశ్శరద్వీపే హంసా స్సరసి మానసే ॥**

**శ్లో ॥ యేస్మజాతాః కురుక్షేత్రే బ్రాహ్మణావేద పారగాః ।**
**ప్రస్థితా దీర్ఘమధ్వానం యూయంతేభ్యోవసీదత ॥**

ఈ రెండు శ్లోకములు రాజసమీపములో పఠించవలెను. ఈ శ్లోకార్థము విని మీకు కావలసిన ధనము ఇవ్వగలడు అని చెప్పి నలుగురు సోదరులు మహా ప్రస్థానము చేసిరి. వీరు భరద్వాజ పుత్రులుగా ఉన్నప్పుడు గోమాంసమును పితృదేవతలకు సమర్పించుటచే ఆదానఫలమహిమచే మహా ప్రస్థానముచేసి బ్రహ్మలోకమునకు వెళ్లగలిగిరి ఇది ఇట్లుండనిమ్ము చివరి ముగ్గురు సోదరుల వృత్తాంతమును తల్లితండ్రుల ధనప్రాప్తిని గురించి చూతము.

మొదటివారగు నలుగురు జ్యేష్ఠసోదరుల శాపమువలన చివరి సోదరులు ముగ్గురు రాజమంత్రి పురోహితులై రాజభోగములను అనుభవించుచుండిరి. అంత ఒకరోజున కురుక్షేత్రమందున్న జ్ఞాని సోదరుల తల్లితండ్రులు ఆరెండు శ్లోకములను పఠించుటకై మహారాజాస్థానమునకేగిరి. ఆసమయమున మహారాజు నగరములో లేరు విహారముకొరకు వనమునకేగిరనువార్త విని రాజాగమనమును నిరీక్షించుచు రాజాస్థానములో రెండురోజులుండిరి. వనములో ఉన్న రాజునకు రాత్రి స్వప్నములో గురువు సాక్షాత్కరించి

ఇట్లు చెప్పెను మీరు భరద్వాజ పుత్రులుగా ఉన్నప్పుడు నా గోవు యొక్క మాంసమును భక్షించి గోవు క్రూరమృగములచే అరణ్యమందు భక్షింపబడినదని అబద్ధము చెప్పి ఆ పాపఫలముగా అనేక జన్మలలో దుఃఖములనుభవించుచున్నారు కాని మీ పాపమంతయు ఇప్పుడు నశించినది. ఈ పైన మీకు సుఖములు సంప్రాప్తించగలవు అని స్వప్నములో గురువు అనుగ్రహించెను. ఈ స్వప్నవృత్తాంతమునకు రాజు ఆశ్చర్యమునొందెను తరువాత వనమునుండి రాజు నగరమునకు వచ్చుచుండగ మార్గమధ్యములో కురుక్షేత్రమునుండి వచ్చిన బ్రాహ్మణదంపతులు ఈ రెండు శ్లోకములను పఠించగానే రాజమంత్రి పురోహితులకు జన్మాంతర స్మృతి లభించినది.

ఆ రెండు శ్లోకముల భావమిది.

**శ్లో ॥ సప్తవ్యాధాః.........యూయంతే భ్యోవసీదత ॥**

భరద్వాజమహర్షిపుత్రులు గోహత్యాపాపము, గోమాంసభక్షణము, గురువునకు అబద్ధము చెప్పుట, ఈ పాపముల ఫలముగ మొదటి జన్మలో ఏడుగురు సోదరులు దశార్ణదేశములో బోయవారై జన్మించిరి. రెండవజన్మలో కాలాంజన పర్వతమందు జింకలుగా జన్మించిరి । మూడవ జన్మలో శరద్వీపమందు చక్రవాక పక్షులై జన్మించిరి నాలుగవ జన్మలో మానససరోవరమందు హంసలై పుట్టిరి. ఈ హంసజన్మ తరువాత జ్యేష్ఠుడు మున్నగు ప్రథమ సోదరులు నలుగురు కురుక్షేత్రములో బ్రహ్మజ్ఞాని కుటుంబములో బ్రాహ్మణులై జన్మించి వేదవేదాంగవేదాన్త పారంగులయిరి. తరువాతవారు బ్రహ్మజ్ఞానఫలముగ మహాప్రస్థానము చేయుటకై బైలుదేరి అరణ్యములో ఉండిరి. చివరి సోదరులగు మీరు ముగ్గురు అనగా రాజమంత్రి పురోహితులారా? మనగురువు అనుగ్రహమువలన ఇప్పటికి మీకు పాప పరిహారము లభించియుండును కనుక మీ ముగ్గురు అరణ్యములో మమ్ములను కలసినచో మనమందరము మహాప్రస్థానము చేసి బ్రహ్మలోకమునకు వెళ్లగలము అని పై రెండు శ్లోకముల భావము ఈ శ్లోకార్థమును గుర్తించిన రాజు కురుక్షేత్ర బ్రాహ్మణదంపతులకు కావలసినంత ధనమిచ్చి పుత్రులకు రాజ్యమును అప్పచెప్పి వల్కలధారణ చేసి అరణ్యమునకు బైలుదేరిరి అరణ్యములో మహాప్రస్థానమునకై ప్రయాణము చేయుచున్న తమనలుగురు సోదరులను కలిసిరి. రాజమంత్రి పురోహితులు ఈ ముగ్గురు సోదరులు తమకంటె

జ్యేష్ఠులయిన తమ బ్రాహ్మణసోదరుల వలన బ్రహ్మజ్ఞానమునొంది వారితో పాటు ఏడుగురు సోదరులు కలిసి పితృదేవతల అనుగ్రహముచేత బ్రహ్మలోకమునకేగిరి. ఈ ఏడుగురు సోదరులు భరద్వాజ పుత్రులుగా ఉన్నప్పుడు అకృత్యములను చేసిననూ గోమాంసమును పితృదేవతలకు సమర్పించిరి. ఈ ధర్మము కృతాది యుగములలో ఉన్నది అందుచేత ఈ కథావృత్తాంతము కృతాదియుగములకు చెందినదిగ తెలియతగినది. ఈ సోదరులు అకృత్యాచరణవలన కొన్ని జన్మలలో దుఃఖములను భావించిననూ చివరకు పితృదేవతల అనుగ్రహము వలన బ్రహ్మలోకమునకేగిరి. శ్రాద్ధాచరణవలన లభించిన పితృదేవతానుగ్రహమెంత మహాఫలదాయకమో ఈ ఉపాఖ్యానము వలన తెలియబడినది అందురు. శ్రాద్ధాచరణవలన పితృదేవతానుగ్రహమును పొందుదురుగాక. ఈ శ్రాద్ధమహిమోపాఖ్యానము హరి వంశము నుండి స్వీకరించబడినది.

☆☆☆

# అన్నదాన మహిమ

## శ్రీ కృష్ణ యజుర్వేదీయ అన్నసూక్త విద్యారణ్య భాష్యమునకు

ఆంధ్ర వివరణము

### ధ్యాన శ్లోకములు

శ్లో॥ వాగీశాద్యాస్సుమనస స్సర్వార్థానాముపక్రమే ।
యం నత్వా కృతకృత్యా స్స్యుస్తం నమామి గజాననమ్ ॥

శ్లో॥ వేదార్థస్య ప్రకాశేన తమోహార్దం నివారయన్ ।
పుమర్థాంశ్చతురోదేయా ద్విద్యాతీర్థ మహేశ్వరః ॥

శ్లో॥ అవిద్యా భానుసంతప్తో విద్యారణ్య మహాంభజే ॥
యదర్క కరతప్తానా మరణ్యం ప్రీతికారణమ్ ॥

### మంత్రము - 1

అహమస్మి ప్రథమజా ఋతస్య । పూర్వం దేవేభ్యో అమృతస్య నాభిః ।
యో మా దదాతి సన ఇదేవమా వాః । అహమన్నమన్న మదన్త మద్మి ॥

మానవుల ప్రాణధారణ అన్నాధీనమై ఉన్నది. కనుక ప్రాణ సంరక్షణ చేయునట్టి అన్న స్వరూపమును గురించి తెలుసు కొనుట అత్యవసరమై యున్నది. కృష్ణయజుర్వేద తైత్తిరీయ బ్రాహ్మణ భాగంలో పఠింప బడిన అన్న సూక్తము సాన్నాయ్య యాగమందు వినియోగింప బడినదని కల్పసూత్ర కారులగు మహర్షులు వివరించి ఉన్నారు. లోకములో ప్రాణి వర్గముచే తినబడుచున్న అన్నం మూడు విధములుగా ఉన్నది.

1. సులభముగా తినుటకు సాధ్యమగు వరి, గోధుమ మొదలైనది.
2. ఎక్కువగా దంతముల ప్రయత్నముతో తినుటకు సాధ్యమగు గారె, లడ్డు, దుంపలు మున్నగునవి.
3. సులభముగా భుజించుటకు త్రాగుటకు యోగ్యములగు పాయసము, ఆజ్యము, చారు, పులుసు మున్నగు రస ద్రవ్యములు. ఈ మూడు విధములైన ఆహార

పదార్థాలను అశన, ఖాద్య, పానములు అంటారు. పైన చెప్పబడిన మూడు విధములగు అన్నములకు అభిమాని దేవత యగు అన్న దేవుని వచనములు ఈ అన్నసూక్తము నందు చెప్పబడినవి.

ప్రథమ మంత్రములో అన్నదేవుడు ఇలా చెప్పుచున్నాడు. ఆదిలో యజ్ఞములను సృజించిన వాడును నేనే. అదెట్లనినచో దేవతల కొరకు పురోడాశము, పాలు, పెరుగు, ఆజ్యము మున్నగు అన్నములు యజ్ఞములయందు సమర్పించబడుచుండును. అన్నమును సృజించిన నేను అన్నముల ద్వారా యజ్ఞములను సృష్టించాను. మరియు పూర్వము దేవతలకు అమృత రూపమగు అన్నమును సంపాదించిన వాడను నేనే.

లోకములో ఇద్దరు వ్యక్తులున్నారు. ఒకరు అన్నదాత మరొకరు అదాత. ప్రథమ వ్యక్తి మహాఫల ప్రాప్తికొరకు ఉత్తమ పాత్రులైన బ్రాహ్మణాదులకు శ్రద్ధాభక్తితో త్రివిధ అన్నములను సమర్పించుచున్నాడు. దాత ఇప్పుడు ఎంత అన్నదానము చేయునో, కాలాన్తరమందు అతనికి ఆ అన్నము వేయిరెట్లు వృద్ధిచెందుతుంది. దాత అన్నదానం ద్వారా కాలాన్తరమందు అన్నదేవుడనైన నన్ను భుజించుట కొరకు ఇప్పుడు నన్ను స్వాధీన పరుచుకొనుచున్నాడని భావము. రెండో పురుషుడు నన్ను దానము చేయక స్వయముగా ఒక్కడే అన్నమును తింటున్నాడు. అదాత అన్నమును నేనే తింటున్నానని అనుకొంటున్నాడు. కాని అతనిని నేనే భక్షిస్తున్నాను. అన్నదానము చేయకపోవుటచేత కాలాంతర మందు అదాత అన్నములేని వాడవుతున్నాడు. అన్నము లేకపోతే ప్రాణము పోతుంది గదా? అదే అతనిని నేను భక్షణచేయడమంటే. ఈ రహస్యమతనికి తెలియదు.

## విశేష వివరణ-

అన్నదానము మానవులకే కాదు దేవతలకు కూడా చేయాలి. మంత్రోచ్చారణచే మనమిచ్చిన ఆజ్యాన్న పురోడాశాది ద్రవ్యములను దేవతలు స్వీకరించి మనకు కావలసిన పుత్ర, మిత్ర, కళత్ర, ధనధాన్యాది సంపదను అనుగ్రహిస్తున్నారు. ఇలా ఉపకారము చేసే దేవతలకు హవిర్భాగములివ్వక స్వశరీర పుష్టికొరకే ఆహారము తినుచున్న వానిని గూర్చి ఈ క్రింద ఉదహరించిన భగవద్గీతా శ్లోకములో కృష్ణ పరమాత్మ ఇలా చెపుతున్నారు.

**శ్లో॥ ఇష్టాన్ భోగవాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః ।**
**తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవసః ॥**

అనగా దేవతలిచ్చిన అన్నాది ద్రవ్యములను వారికి సమర్పించక భుజించు వాడు దొంగవంటి వాడు.

మరియు యజ్ఞయాగాది కర్మానుష్ఠానములలో దేవతలకు ఇవ్వగా శేషించిన అన్నమును అమృతమంటారు. బ్రాహ్మణులకు సమర్పింపగా శేషించిన అన్నమును విఘసమంటారు. ఈ రెండు విధములైన అన్నములను భుజించిన వారికి సర్వ పాపాలు తొలగిపోతాయి. దేవ బ్రాహ్మణులకు సమర్పించక కేవలము తన కొరకే అన్నమును వండుకొని భుజించు వానిని గురించి శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో ఇట్లు చెప్పారు.

**శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।**
**భుజంతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥**

దానము చేయక తానే భుజించువాడు అన్నమును భుజించుట లేదు పాపమునే భుజిస్తున్నాడు.

లోక దృష్టిలో అది అన్నముగా కనబడిననూ, శాస్త్ర దృష్టిలోనూ దేవతా దృష్టిలోనూ అది పాపమే. పాప రూపముగా ఉన్న అన్నమును తింటున్నాడని గీతా రహస్యము.

## 2వ మంత్రము

పూర్వమగ్నే రపి దహత్యన్నమ్ । యత్తౌ హాసాతే అహముత్తరేషు ॥
వ్యాత్తమస్య పశవస్సుజంభమ్ ।పశ్యన్తి ధీరాః ప్రచరన్తి పాకాః ॥

మనము తింటున్న ఆహారాన్ని ఉదరంలో ఉన్న జఠరాగ్ని పచనము చేయుటకు ఒక పూట సమయము కావాలి. కాని అన్నదానము చేయక తాను మాత్రమే తినుచున్న వాణ్ణి దహించటంలో అన్న దేవునకు ఒకపూట సమయము అవసరం లేదు. అన్నదేవుడు అదాతను వెంటనే దహించేస్తాడు. లోక దృష్టిలో అదాత దాతలాగా కనబడిననూ, అదాతకు దానము చేయక భోజనము చేయు క్షణమందే పాపము వస్తోంది. ఆ పాపము వలన అతనికి కాలాంతరములో నరక ప్రాప్తి సంభవిస్తుంది అందుకే **"అదాతా విష మశ్నుతే"**

అని పెద్దలంటారు. అనగా అదాత అన్నము తినుట లేదు, విష రూపమయిన అన్నమును తింటున్నాడని భావము.

అన్నదాత, అదాత ఉభయులూ వారి వారి ప్రయత్నములు చేస్తున్నారు. దాత అన్నదానము చేయుట కొరకు ఉత్తమ పాత్రులను సంపాదించుటకై ప్రయత్నము చేస్తున్నాడు. అదాత ఎవరికీ పెట్టుటకు ఇష్టంలేక భోజనము చేయుటకు ఎవరూ లేని చోటు కొరకు ప్రయత్నము చేస్తున్నాడు. వీరి విషయములో అన్న దేవుడు ఇలా అంటున్నాడు.

ఎవరు అన్నదానము చేస్తున్నారో అలాగే అన్నదానము చేసేవారికి సర్వ విధముల సహాయం చేస్తున్నారో, అట్టి వారు సర్వోత్తములు. అట్టివారికి నేను ఎల్లప్పుడు అన్న సమృద్ధిని కలుగచేస్తాను. ఎవరు నన్ను దానము చేయక తినుచున్నారో అట్టివారు పశువులతో సమానులు, మూఢులు. అటువంటివారిని తినుటకు నేను తీవ్రమైన కోరలు గల నా ముఖాన్ని తెరచుకొని సిద్ధంగా ఉంటాను. ఈ విధముగా చెపుతున్న అన్నదేవుని అభిప్రాయమును కొంత మందే తెలుసుకొంటున్నారు. వారు బుద్ధిమంతులు. ధీరులు. వారే అన్నదాతలు. పైన చెప్పిన అన్నదేవుని అభిప్రాయమును తెలుసు కోలేని వారు అజ్ఞానులు, మూర్ఖులు.

## విశేష వివరణ-

మనముతిన్న అన్నమును ఉదరమందున్న జఠరాగ్ని జీర్ణము చేయును. ఈ అగ్నిని వైశ్వానరాగ్ని అంటారు. ఈ విషయము భగవద్గీతయందు చెప్పబడినది.

**శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥**

పరమేశ్వరుడు జఠరాగ్ని రూపముగా సర్వ ప్రాణుల ఉదర మందు ప్రవేశించి వారు నిత్యమూ సేవిస్తున్న భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య ఆహారములను మరల పచనము చేస్తున్నాడు. ఈ చతుర్విధ పదార్థముల విశేషములు ఇట్లున్నవి.

1. **భక్ష్యములు** - దంతవ్యాపార సాధ్యములైనవి. లడ్డు, గారె, దుంపలు మున్నగునవి.
2. **భోజ్యములు** - పాయసము అన్నము మున్నగునవి.

3. **లేహ్యములు** – తేనె, బెల్లంపాకం, అల్లం పచ్చడి మున్నగునవి నాలుకతో చప్పరించుటకు వీలగునవి.

4. **చోష్యములు** – పులుసు, చారు, మజ్జిగ మున్నగునవి (పుక్కిలింతతో స్వీకరించుటకు సాధ్యమగునవి). ఈ చతుర్విధ ఆహార ద్రవ్యములను సోమదృష్టితో చూడవలెను. సోముడనగా చంద్రుడు. మనచే తినబడుచున్న సర్వ పదార్థములు రాత్రియందు చంద్రుని అమృత కిరణ సంపర్కము చేతనే వృద్ధిచెంది, అమృతము వలె రుచికరములై భక్షణ యోగ్యములగుచున్నవి. ఈ విషయములో గీతాచార్యులు భగవద్గీతలో ఇలా అన్నారు.

**పుష్ణామిచౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ।**

నేను అమృత స్వరూపముతో చంద్రుడనై, కిరణముల ద్వారా ఓషధుల యందు ప్రవేశించి ఓషధులను నా అమృత స్వరూపంతో వృద్ధి పొందించుచున్నాను. పరమేశ్వరుడు చంద్ర స్వరూపముతో ఆహారమును సృష్టించి, వృద్ధి చేస్తున్నాడు. జఠరాగ్ని స్వరూపంలో భుజించిన ఆహారమును పచనము చేస్తున్నాడు. ఈ విధంగా అగ్ని, సోములచేతనే జగద్వ్యవహారము నడుస్తోంది. కనుక అగ్ని సోములే ఈ జగత్తు అని ధ్యానము చేసినచో అన్నదోషము ఉండదు. అన్నదాతకు సంబంధించిన దోషము అన్నమందున్ననూ, ఈ ధ్యాన ప్రభావంచేత భోక్తకు అన్నదోషము సంక్రమించదని శంకర భగవత్పాదులు ఈ ఉపాసనా రహస్యమును తన భాష్యములో ఇట్లు విశదీకరించిరి:

**భోక్తా వైశ్వానరోగ్నిః । భోజ్యమన్నం సోమః ।**
**తదేతదుభయ మగ్నీషోమౌ సర్వమితి పశ్యతః అన్నదోష లేశో న భవతి ।**

ఇక్కడ మరొక విశేషాన్ని గ్రహించాలి, పైన ఉదహరించినట్లుగా మరొక విధముగా నాలుగు విధములగు ఆహారాలు ఉన్నాయి.

1. పార్థివాహారము
2. జలమయ ఆహారము
3. వాయురూప ఆహారము

4. తేజోరూప ఆహారము.

ఈ ఆహారాలను భుజించు ప్రాణి వర్గము కూడా నాలుగు విధములుగా ఉన్నవి.

1. పార్థివాహారమనగా భూలోకమందు లభించు భక్ష్య భోజ్య లేహ్య చోష్య ద్రవ్యములు. వీట్లను భుజించు వారు మానవులు.
2. జలమే ఆహారము చాతక పక్షికి. ఈ పక్షి అన్తరిక్షము నుండి మేఘము ద్వారా లభించు వర్షజల బిందువుల తోనే జీవిస్తుంది.
3. సర్పాదులు గాలినే ఆహారంగా స్వీకరిస్తాయి.
4. చకోర పక్షులు వెన్నెల తిని జీవిస్తున్నాయి. వాలఖిల్యాది మహర్షులు సూర్య కిరణాలను ఆహారంగా తీసుకుని జీవించారని గ్రంథాలు చెపుతున్నాయి. చంద్ర కిరణాలు, సూర్య కిరణాలు తేజో రూపమైన ఆహారము.

పైన ఉదహరించిన ప్రాణివర్గ మందు ప్రవేశించిన పరమేశ్వరుడు జఠరాగ్ని రూపముతో పైన ఉదహరించిన చతుర్విధ ఆహారములను జీర్ణము చేస్తున్నాడు. ఇలా పచనము చేయగా లభించిన స్థూల పదార్థము మల మూత్ర రూపముగా బహిర్గతమౌతుంది. సూక్ష్మ భాగము వాక్కునకు, మనస్సునకు, ప్రాణమునకు శక్తిని సంపాదించునవి అని ఛాందోగ్యోపనిషత్తు చెపుతోంది. పరమేశ్వరుడే అగ్ని సోమ స్వరూపుడై జగత్తునంతటనూ వ్యాపించి ఉండగా పరమేశ్వరుడు లేడను వాదము సాహసోపేతమై ఉండును. నిష్ప్రమాణమని భావము.

## 3వ మంత్రము -

జహామన్యం నజహామ్యన్యమ్ । అహమన్నం వశమిచ్చరామి ॥
సమాన మర్థం పర్యేమి భుంజత్ । కోమామన్నం మనుష్యోదయేత ॥

అన్నదేవుడనైన నేను అదాతను పరిత్యజిస్తున్నాను. అన్నదాతను పరిత్యజించను. అన్నదాతను నావాడిగా చేసుకొంటాను. అనగా అన్నదేవుడు అన్నదాతకు స్వాధీనుడై ఉంటాడని భావము. లోకములో ఏమానవుడు భోగమునకు, దానమునకు సమానముగా ధనమును ఆర్జించుచున్నాడో అట్టి వానికి నేను సర్వవిధములా రక్షణ కల్పించగలను. ఏ

మానవుడు భోగము కొరకే సంపాదించునో దానము కొరకు ధనమును సంపాదించడో వానిని నేను రక్షించను, పొందను, పైగా పరిత్యజిస్తాను. ఇలా అదాతను పరిత్యజిస్తూ, దాతను రక్షిస్తూ, దాత పట్ల పక్షపాతము చూపిస్తున్న నన్ను లోకములో ఎవరు నివారించగలరు? నివారించుటకు ఎవరూ సమర్థులు కారని అన్నదేవుని స్వాతంత్ర్య ప్రకటన ఇందులో తెలుస్తోంది.

## విశేష వివరణము -

అన్నదానము ప్రశస్తమని భాష్య వివరణ వల్ల తెలుస్తోంది. కాని దానమెలా చేయాలి? దానాలు ఎన్ని విధాలు? ఏ దానము ప్రశస్తము? అనే విషయంలో భగవద్గీతలో గీతాచార్యులు సెలవిచ్చారు.

**శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతం ॥**

దానము స్వీకరించువాని నుండి ప్రత్యుపకారమును అపేక్షించక దేశ కాల పాత్రలను ఎరిగి చేయు దానము సాత్విక దాన మనబడును.

**శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతం ॥**

ప్రత్యుపకార బుద్ధితో గానీ ఫలాపేక్ష కలిగి కానీ బాధపడుచూగానీ చేయుదానము రాజస దానమని చెప్పబడినది.

**శ్లో॥ అదేశ కాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామస ముదాహృతం ॥**

దేశ కాల పాత్రలతో సంబంధంలేక అగౌరవంగా అవమాన పూర్వకంగా చేయు దానము తామస దానమని చెప్పబడును.

ఆహారము కూడా సాత్విక, రాజస, తామస బేధములతో మూడు విధములని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో ఇట్లు బోధించారు-

**శ్లో॥ ఆయుస్సత్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః ।**
**రస్యాస్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారా స్సాత్విక ప్రియాః ॥**

చిరకాల జీవనాన్ని, మనస్సునకు ధైర్యమును, స్థైర్యమును, ఉత్సాహమును అనగా ప్రబల దుఃఖ మేర్పడిననూ నిర్వికారముగా ఉండుట, శరీరేంద్రియ సామర్థ్యమును, వ్యాధిలేకపోవుటను, భోజనానంతరము తృప్తిని, భోజనకాల మందు ఆహారాభిరుచిని వృద్ధిచేయు ఆహార పదార్థములు; మధురరస ప్రధానమయిన ఫలములు, పటికబెల్లము, పంచదార వీటితో తయారు చేయబడిన పిండి వంటలు, స్నేహపదార్థములు అనగా చిక్కని పాలతో నూనెతో నేతితో తయారయిన పిండి వంటలు; ఏ ఆహార పదార్థములు, భుజించిన తరువాత శరీరమందు చాలా కాలము శరీరేంద్రియాదులకు బల సంపాదకములగునో అట్టి కంద మూలాది ఆహార పదార్థములు మరియు దుర్గంధము అపవిత్రత లేని ఆహార పదార్థములు సాత్వికాహారములు ఇవి మానవునకు చిత్త సత్వ సంపాదకములు. సత్వము జ్ఞాన సంపాదకమై మోక్ష దాయకమగును. అందుచేత సాత్వికాహారములనే సేవించాలి. పైన చెప్పబడిన ఆహారమును సేవించు మానవుడు సాత్వికుడని గ్రహించ వచ్చును.

**శ్లో॥ కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః ।**
**ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః ॥**

కటుశబ్ద మునకు కారము అని అర్థము, కాని ఈ శ్లోకములో చేదు అని అర్థము చెప్పాలి. తీక్ష్ణ శబ్దముచే కారము అని అర్థము చెప్పబడుచున్నది. ఆమ్ల మనగా పులుపు. లవణము తెలిసినదే. ఉష్ణము-వేడివేడి పదార్థము. రూక్షము- చమురు లేని పదార్థము, విదాహీ- దాహమును కలుగజేయునవి- ఆవాలు మొదలైనవి. ఇవన్నీ మితముగా భుజించవచ్చును. కాని శ్లోకమందున్న అతి శబ్దము ఈ ఏడు ఆహార పదార్థములతో సంయోజన చేయ వలయును. అతి శబ్దమునకు మిక్కిలి అని అర్థము.

1. మిక్కిలి చేదు-వేప
2. మిక్కిలి పులుపు-నిమ్మ
3. మిక్కిలి ఉప్పు
4. ఎక్కువ వేడి అనగా చేతులు నోరు కాలే పదార్థములు.
5. అతి తీక్ష్ణం-అపరిమిత కారముకల మిరియము మొదలగునవి.

6. అతి రూక్షం – ఏ కొంచెము చమురు లేని కొర్రలు. ఆళ్లు మున్నగునవి.

7. అతి దాహ– మిక్కిలి దాహమునిచ్చు అవపిండి మున్నగు పదార్థములు.

రాజస ఆహార పదార్థములను సేవించు వానికి వెంటనే దుఃఖము తరువాత శోకము రోగము ప్రాప్తించును. రాజసాహారము భుజించు వారికి రజోగుణము వృద్ధి చెందును. రాజసాహారమును సేవించు వారిని రాజసులంటారు.

**శ్లో॥ యాతయామం, గతరసం, పూతి, పర్యుషితం, చ యత్ ।**
**ఉచ్ఛిష్టమసి చా మేధ్యం భోజనం తామస ప్రియం ॥**

అర్ధ పక్వము–సగం ఉడికిన పదార్థము, ఎక్కువగా ఉడికిన పదార్థము, దుర్గంధోపేతం–పాసి పోయినవి, ఉచ్ఛిష్టం–ఇతరులు తినగా వారి ఎంగిలి, యజ్ఞములకు అనర్హమయిన ఉల్లిపాయి మున్నగు ఆహార పదార్థములు తామస వ్యక్తులకు ప్రియమైన ఆహారము. తామసాహారమును సేవించినచో తమో గుణము వృద్ధి చెందును. వీరిని తామసులంటారు. ఉత్తమ శ్రేయస్సును అభిలషించు ముముక్షువులు రాజస, తామస ఆహారములను పరిత్యజించి సర్వకాల సర్వావస్థలయందు సాత్వికాహారమును, సాత్విక దానములను చేయవలెను. సత్వాభివృద్ధికై సాత్వికాన్నమును భుజించుట, సాత్వికాన్నదానము చేయుట ఉత్తమ లక్షణం.

## 4వ మంత్రము –

పరాకే అన్నం నిహితం లోక ఏతత్ । విశ్వైర్దేవైః పితృభిర్గుప్త మన్నం ॥
యద్దద్యతే లుప్యతే యత్పరోప్యతే । శతతమీ సా తనూర్మే బభూవ ॥

అన్నదేవుని మహాత్మ్యము ఈ మంత్రంలో చెప్పబడుతోంది. అన్న వ్యవహారము లోకంలో రెండు విధాలుగా చూడబడుతోంది.

1. పారలౌకిక వ్యవహారము
2. ఐహిక వ్యవహారము

అన్నదాత పితృదేవతాది లోకాలలో నాకు అన్నసమృద్ధి కలుగుగాక అనే భావంతో ఉత్తమ పాత్రులైన వారికి అన్నదానం చేస్తున్నాడు. భూలోకంలో అగ్నియందు,

బ్రాహ్మణులయందు సమర్పించిన అన్నము భూలోకానికి మిక్కిలి దూరంలో ఉన్న పితృ దేవతాది లోకాల్లో ఉన్న దేవతలకూ, పితృదేవతలకూ సంక్రమిస్తుంది. భక్తి శ్రద్ధలతో మనమిచ్చిన అన్నాన్ని దేవతలు ఆదరంతో స్వీకరించి ఈ అన్నదాన ఫలాన్ని అన్నదాత స్వర్గలోకానికి వచ్చేవరకూ రక్షించి, దాతకు సమర్పిస్తారు. ఇది పారలౌకిక అన్న వ్యవహారము.

ఇక ఐహిక అన్నవ్యవహారాన్ని చూద్దాం. ఐహిక వ్యవహారము అనేకరకాలుగా కనబడుతోంది.

దానములేక తనకు తానే భుజించటం. భుజించిన దాన్ని జఠరాగ్ని దహింప చేస్తున్నాడు కనుక నశించింది అనటం. మాడి పోయిన అన్నము వాసన వచ్చిన అన్నము.

మాడిన అన్నాన్ని వాసన వచ్చినదాన్ని వీధిలో పారవేయటం, ఈవిధంగా చేయటం తన ఐశ్వర్యమింతది అని ప్రకటన చేయటమే కానీ ప్రయోజనకారి కాదు. ఇది ఐహికాన్న వ్యవహారము. ఇట్లు ఐహికాముష్మిక వ్యవహారమంతా అన్నదేవుని మహిమలో శత సంఖ్యాలేశము అని అన్నదేవుని ప్రకటన. ఇదంతా అన్నదేవుని మహిమలో నూరవలేశమైతే అన్నదేవుని మహిమ ఎంతటిదో మనము తెలుసుకోలేము.

## విశేష వివరణ -

శరీరేంద్రియ పుష్టిని, ధనధాన్య పుష్టిని కాంక్షించిన వైశ్వదేవ కర్మానుష్ఠాత నిత్యము భూత బలిని ఇస్తూ ఉంటాడు. ఈ విషయంలో వినియోగింపబడే మంత్రానికి విద్యారణ్య భాష్య ఆంధ్రానువాదాన్ని చూడండి.

యే భూతాః ప్రచరన్తి దివానక్తం బలి మిచ్ఛన్తో వితుదస్య ప్రేష్యాః ।
తేభ్యో బలిం పుష్టికామో హరామి మయి పుష్టిం పుష్టిపతిర్దధాతు స్వాహా ॥

శరీరేంద్రియ పుష్టిని, ధన ధాన్య పుష్టిని, కాంక్షించిన నేను అన్నము కొరకు గ్రద్ద మున్నగు భూతముల కొరకు, అన్నమును బలి విధానముగా భూమియందు ఉంచుచున్నాను. శ్మశానవాసియైన కాలాగ్ని రుద్రుడు అన్నదానం చేయని పాపులను పీడించటం కోసం కొంత మంది దూతలను పంపుతాడు. గ్రద్ద, నక్క, యుద్ధమందు

ఆసక్తిగల మేక-పొట్టేలు (దీనిని భయేడక మంటారు), ఆడగాడిద (దీనిని దీర్ఘముఖి అంటారు) ఈ జంతువులన్నీ యమదూతలని ఆరణ్యక భాగంలో మంత్ర బ్రాహ్మణంలో చెప్పబడింది. వీనిలో కొన్ని, నక్క, మేక, గాడిదా మొదలైనవి భూలోకంలో నివసిస్తాయి. గ్రహములు అన్తరిక్ష లోకంలో నివసించేవి. వీట్ల కొరకు భూమియందుంచిన బలి అన్నాన్ని ఆ భూతాలు తిని తృప్తి చెంది, అన్నదాతను ఏమీ చేయవు. అహోరాత్రములు అన్నము కొరకు సంచరించు తన భృత్యులకు బల్యన్నమును దానము చేసిన అన్నదాతకు తన భృత్యుల వలన ఎట్టి మరణమూ లేకుండు నట్లు రుద్రుడు చూస్తాడు. మరియు పుష్టిపతి, ధనధాన్యపతి, పోషణపతి అయిన శంకరుడు బల్యన్న దాతకు ధనధాన్య శరీరేంద్రియ పుష్టిని కలుగ జేసి రక్షిస్తూ ఉంటాడు. ఇది వేదరహస్యం.

### 5వ మంత్రము -

మహాన్తా చరూ సకృద్దుగ్ధేన పప్రౌ । దివంచ పృశ్ని పృథివీంచ సాకమ్ ।
తత్సంపిబన్తో న మినన్తి వేధసః । నైతద్భూయో భవతి నో కనీయః ॥

అన్నదేవుని మహిమ ఈ మంత్రంలో ఈ విధంగా చెప్పబడుతోంది. బహు క్షీరము కల గోవును పితుకగా వచ్చిన క్షీరంతో రెండు కడవలు నిండిపోతాయి. అలాగే స్వల్పంగానైనా మంత్రములచే పవిత్రమయిన అన్నము భక్తి శ్రద్ధలతో అగ్నియందూ, ఉత్తమ పాత్రుని యందూ, సమర్పించబడిన అన్నము భూలోకాన్నీ స్వర్గలోకాన్నీ పూరించి, అన్నదాతకు లోక ద్వయము అన్నపూర్ణ- మయ్యేట్టు చేస్తుంది. అన్నదాతకు భూలోకంలోనూ, స్వర్గలోకంలోనూ అన్నానికి లోటుండదని భావము. బ్రాహ్మణులకూ, దేవతలకూ, అన్నదానము చేయగా మిగిలిన అన్నము విఘసమని, అమృతమని చెప్పబడుతోంది. ఈ అన్నమును భుజించిన అన్నదాత అన్నమును నాశనము చేసిన వాడు కాదు. తనను కూడా నశింప చేసుకున్నవాడు కాదు. కారణమేమనగా అన్నదాన ప్రభావంచేత అన్నము వృద్ధి చెంది తన భోజనమునకు సర్వకాలముల యందు అన్నము సిద్ధముగా ఉండును. అన్నములేక ప్రాణము పోయినది అనుమాట అన్నదాతకు ఉండదు. అందుచేత అన్నదాత తన ఆత్మ సంరక్షణ చేసుకున్న వాడగును. లోకములో మిక్కుటముగా అన్నము భుజించిన వానికి అజీర్ణ వ్యాధి సంభవించును. తక్కువగా భుజించిన వారికి ఆకలి తీరదు. ఈ

రెండు దోషములూ అన్నదాతకు ఉండవు. కారణమేమనిన అన్నదాన ప్రభావము చేత అన్నదానానంతరము భుజించిన అన్నము అన్నదాతకు ఔషధి వంటిదౌతుంది.

## విశేష వివరణము -

ఈ మంత్రభాష్య వివరణలో స్వల్పముగా దానము చేయబడిన అన్నము భూలోకాన్ని, స్వర్గలోకాన్ని పూరిస్తుందని చెప్పబడింది. అదెలా సాధ్యం? దానం చేసిన అన్నం స్వల్పం గదా? లోకద్వయము విశాల మయినది కదా? అనే శంకకు యావదేకా అను శ్రుతి భాష్యంలో శ్రీ విద్యారణ్య స్వామి ఈ విధంగా సమాధానం చెప్పారు-

**యావదేకాదేవతా కామయతే యావదేకా । తావదాహుతిః ప్రథతే ।**
**నహి తదస్తి । యత్తావ దేవస్యాత్ । యావజ్జుహోతి ॥**

ఆయా దేవతలను ఉద్దేశించి మంత్రోచ్చారణ పూర్వకముగా అగ్ని యందు మనము సాధారణముగా రేగు పండు వంటి పరిమితమగు హవిస్సును హోమము చేస్తున్నాము, కాని ఆ ద్రవ్యము అంత మాత్రముగానే దేవతను పొందదు. మంత్రోచ్చారణ ప్రభావంచేత ఆయాదేవతలకు ఎంత కావాలో అంతగా వృద్ధి చెంది ఆయా దేవతలను పొందుతోంది. అలాగే హవిస్సు స్వల్పమయినాకూడా పృథివీలోకాన్నీ స్వర్గలోకాన్నీ వ్యాపించటం సమంజసమే. ఈ విషయములో మరియొక శ్రుతి మరొక దృష్టాన్తరమును విశదీకరించింది.

**అథౌషధీ రన్తగతా దహతి తాస్తతో భూయసీః ప్రజాయన్తే ॥**

అనగా అగ్నియందు సాయంప్రాతః కాలాల్లో హోమము చేయబడే అన్న, ఆజ్య, సమిత్, పురోడాశాది హవిస్సు మనము చూస్తుండగానే దగ్ధమైపోతోంది. కాని అది మనకు నిలవ ఉన్న ధనమని, అభివృద్ధి చెందేదని శ్రుతి బోధిస్తోంది. వ్యవసాయదారులు చెరుకు తోటను దగ్ధము చేస్తారు. అది దాహానంతరము అభివృద్ధి చెందినట్లు అగ్ని యందుంచిన హవిస్సు కూడా అభివృద్ధి చెందును. ఇక్కడ భక్తి శ్రద్ధలు అత్యావశ్యకములై ఉన్నయి. ఈ విషయములో భగవద్గీతలో కృష్ణ పరమాత్మ-

**శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి ।**

**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥**

భక్తి శ్రద్ధలతో ఇచ్చినది పత్రమైనను, పుష్పమైననూ, ఫలమైననూ నేను స్వీకరించి దాతను అనుగ్రహిస్తాను. పాండవులను కృష్ణపరమాత్మ ఇట్లనుగ్రహించెను.

పాండవులు అరణ్య వాసము చేయు కాలములో అకాలమందు భోజనార్థమై వేల శిష్యులతో దుర్వాస మహర్షి పాండవుల వద్దకు వచ్చాడు. వెంటనే ధర్మరాజు భోజనానికై స్నానము చేసి రమ్మనమని సవినయముగా కోరాడు. అంత దుర్వాస మహర్షి శిష్యులతో నదీ స్నానమునకు వెళ్లెను. పతివ్రతా శిరోమణి ద్రౌపదీ దేవి ఆపద్బాంధవుడగు శ్రీ కృష్ణుని స్మరించింది. శ్రీ కృష్ణుడు సాక్షాత్కరించెను. భోజనానంతరము కడిగి బోర్లించిన అక్షయ పాత్రయందు ఒకానొక కూర ముక్క దొరికినది. దానిని భక్తితో శ్రీ కృష్ణునకు ద్రౌపదీ దేవి సమర్పించగా తన ఉదరమందున్న సర్వ బ్రహ్మాండములతో సహ తృప్తి చెందాడు. సర్వ బ్రహ్మాండములలో ఒక భాగమందున్న శిష్యులతో కూడిన దూర్వాస మహర్షి కూడా తృప్తి చెందెను. ధర్మరాజు వద్దకు వెళ్లినచో భోజనము చేయమని ప్రార్థిస్తాడు. మనము ఈపైన భోజనము చేయలేము. ఉదరములో చోటు లేదు అని దుర్వాస మహర్షి తిరిగి తన ఆశ్రమానికి వెళ్లి పోయాడు. ఈ ఘట్టాన్ని మహాత్ములు ఒక్క శ్లోకంలో పొందు పగిచారు.

**శ్లో॥ ద్రౌపదీ శాకమాసాద్య త్రిలోకీ యేన తర్పితా ।**
**తజ్జీవ బ్రహ్మణో రైక్యే బ్రహ్మైవ నో హరిః ॥**

భక్తి శ్రద్ధలతో చేసిన అన్నదానము అనన్త ఫల ప్రదమని తెలుసుకోవాలి.

పై మంత్రార్థములో అన్నదానానంతరము దాత భుజించిన అన్నము అనారోగ్య కారణము కాదని చెప్పారు, అదెలా సంభవం? అన్న ప్రశ్నకు భాష్యకారులు భగద్గీతా శ్లోకంతో సమాధానము చెప్పారు.

**నాత్యశ్నతస్తు యోగోస్తి నచైకాన్త మనశ్నతః**

యోగి తన యోగాభ్యాస కాలమందు ఆహార నియమము కలవాడు కావాలి. ఎక్కువగా ఆహారాన్ని స్వీకరించినా, తక్కువగా ఆహారము స్వీకరించినా యోగము సిద్ధించదు. మితముగా భుజించాలి, మితముగా భుజించు వానికి యోగ సిద్ధి మరియు వేదాన్త శ్రవణము బ్రహ్మచర్యము కూడ సిద్ధిస్తాయి. అన్నదాన మహిమ చేత అన్నదానంతరము భుజించిన

అన్నము అన్నదాతకు ఆరోగ్య కారణమై యోగాభ్యాసమునకు యోగ్యమై యుండును. అనగా అన్నదాత యోగ ప్రాప్తికి, వేదాన్త శ్రవణమునకు, బ్రహ్మచర్య సిద్ధికి, తగినట్లే భుజించునని భావము. అట్టి వానిని అన్నదేవుడు లోకద్వయమందు సర్వదా రక్షిస్తుంటాడని భావము.

## 6వ మంత్రము -

అన్నం ప్రాణ మన్న మపాన మాహుః ।
అన్నం మృత్యుం తము జీవాతుమాహుః॥
అన్నం బ్రహ్మణో జరసం వదన్తి ।
అన్నమాహుః ప్రజననం ప్రజానామ్ ॥

అన్నదేవుని మహిమ మళ్లీ వర్ణింపబడుతోంది. అన్నదేవుడు సమస్త జగద్వ్యవహారమునకు కారణమై ఉన్నాడు. అదెట్లనగా ప్రాణుల శరీరముల యందు వాయు సంచారము రెండు విధములుగా ఉన్నది.

1. ప్రాణవాయువు పైకి సంచరించుట.
2. అపానవాయువు క్రిందకి సంచరించుట.

ప్రాణాపాన వాయు సంచారము అన్న బలము చేతనే జరుగుతోంది. అన్నము లేని వానికి ప్రాణాలే పోతాయి. అందుచేత ప్రాణాపాన వాయువులు అన్న స్వరూపములని చెప్పబడుతున్నాయి. మరియు అన్నము ఒకప్పుడు మృత్యువుగానూ, ఒకప్పుడు జీవనంగానూ పరిణమిస్తోంది. తిన్న అన్నము జీర్ణం కానిచో రస వైషమ్యాన్ని పొంది వ్యాధిని సృష్టించి తద్వారా మృత్యు కారణమవుతోంది. మరియు అన్నము ఔషధంలాగా ప్రాణ సంరక్షణ చేస్తోంది. అందుచేత జీవన కారణమగుచున్నది. అన్నము ఒకానొక సమయమందు శరీరేంద్రియ పుష్టిని కలిగించి సంతానోత్పత్తికి కూడా కారణమవుతోంది. మరొక సమయమందు ఒకానొక అన్న విశేషము తన భక్షణ చేత జుట్టు నెరసిపోవుట, శరీరము ముడతలు పడుట ఇట్టి ముసలితనమును సంపాదించుచున్నది. ఆహార పదార్థములలో ఇట్టి తారతమ్యాలను సృష్టించగల శక్తి ఉన్నదని ఆయుర్వేద శాస్త్రాభిజ్ఞులు చెబుతున్నారు.

## విశేష వివరణ-

తైత్తిరీయోపనిషత్తులో యేన్నం బ్రహ్మోపాసతే అనే మంత్రం అన్న బ్రహ్మోపాసనను చెబుతోంది. అనగా అన్నమును బ్రహ్మగా భావించాలి అని అర్థం. అన్నము బ్రహ్మ ఎలా అవుతుంది? అని సందేహము.

కాని బ్రహ్మ ఎలాగైతే జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములను చేస్తున్నాడో అదేవిధంగా అన్నము కూడా సృష్టి, స్థితి, లయములను చేస్తున్నది. అదెట్లనగా అన్నము భుజించినచో శరీరేంద్రియ పుష్టి కలిగి తద్వారా ప్రాణులు జన్మిస్తున్నారు. జన్మించిన ప్రాణులు అన్నము వలననే బ్రతుకుతున్నారు. అన్నమే ఒకానొక సమయమున అజీర్ణాది వ్యాధి ద్వారా మరణ కారణమగుచున్నది. అందుచేత అన్నము కూడ ప్రాణివర్గము యొక్క సృష్టి స్థితి లయములకు కారణమగుట చేత అన్నమును బ్రహ్మగా భావించమని ఉపనిషన్మర్యాద. అందుచేతనే **అద్యతేత్తిచ భూతాని। తస్మాదన్నం తదుచ్యత ఇతి,** అను తైత్తిరీయోపనిషత్తు అన్న శబ్దమును ఇట్లు నిరూపిస్తోంది- ముందుగా ప్రాణులచే తినబడేది కనుక అన్నమనియూ, తరువాత ప్రాణులను తనే తినేది కనుక అన్నమని అన్న శబ్ద నిర్వచనము రెండు విధములుగా బోధించబడినది.

## 7వ మంత్రము -

మోఘమన్నం విన్దతే అప్రచేతాః। సత్యం బ్రవీమి వధ ఇత్సతస్య।
నార్యమణం పుష్యతి నో సఖాయం। కేవలాఘోభవతి కేవలాదీ ॥

అన్నదేవుడు ఇట్లు బోధిస్తున్నాడు. అన్నదానము చేయనివాడు వివేక శూన్యుడు. అతను వ్యర్థముగా ధనార్జన చేసి ఆహార పదార్థములు పొందుచున్నాడు. అదాత అన్నదానము చేయక పోవుట చేత తన వద్ద వున్న ఆహార పదార్థములను వధిస్తున్నాడు. ఈ విషయము సత్యము. సత్యమునే నేను చెపుతున్నాను. అదాత (దానము చేయనివాడు) అర్యమాది దేవతలకు, మిత్రులకు అన్నదానము చేసి తృప్తిని కలుగచేయలేకపోతున్నాడు. అందుచేత వారిని పోషించినవాడగుట లేదు అని అన్నదేవుని వచనము.

అర్యమా దేవత అనగా ఎవరు? ఈ విషయమై తైత్తిరీయ సంహితలో ఈ విధంగా చెప్పబడింది.

అర్యమ్ణే చరుం నిర్వపేద్యః కామయేత దాన కామామే ప్రజాస్స్యురిత్యసౌవా ఆదిత్యోర్యమా యః ఖలు వై దదాతి సోర్యమా, అర్యమణమేవ స్వేన భాగధేయేనోపధావతి స ఏవాస్మై దానకామాః ప్రజాః కరోతి దానకామా అస్మై ప్రజాభవన్తి ॥ – తై.సం.. 2-2-4.

ప్రజలు తనకు దానము చేయువారు కావలయునని కోరుచున్న యజమానుడు అర్యమ అను దేవతకు అన్న హోమము చేయాలి. ఇదొక యాగము, ఈ యాగానుష్ఠాన ప్రభావము చేత ప్రజలు తనపట్ల ధన దానము అన్నదానము చేసే దాతలగుదురు. అర్యమ అనగా సూర్యుడు. ఈ యాగమందు ఆరాధింపబడిన సూర్యుని ప్రేరణ చేతనే ప్రజలు దాతలగుటచేత దాత కూడ అర్యమా-సూర్యుడే అని ఈ శ్రుతి వర్ణిస్తోంది. ఎవరి అనుగ్రహము ఎవరిలో ప్రవేశించునో వారు వారే అనుట సహజము గదా? అందుచేత దాత కూడ సూర్యుని వలే ప్రకాశిస్తున్నాడని భావించాలి. అట్టి అర్యమాది దేవతలనూ మిత్రులనూ అదాత అన్నదానముతో ఆరాధించక పోవుట చేత అదాత ఇహలోక, పరలోక భ్రష్టుడు. అదాతను కేవలాఘుడని శ్రుతి నిందించినది. ఎవరికీ పెట్టక తను మాత్రమే తిను వానిని కేవలాఘుడు అంటారు. అనగా అదాత భుజించునది అన్నము కాదు పాపమే, పాపాన్నే తింటున్నాడు. పాప రూపముతో ఉన్న అన్నాన్ని తింటున్నాడు అని భావము. కొంచెంగానైనా ఇతను పుణ్యమును సంపాదించటం లేదు. అధాత అన్నమును భుజించుట అన్నవధ అని అందురు. ఇది నరక ప్రాప్తికి కారణము.

## 8వ మంత్రము –

**అహం మేఘస్స్తనయన్ వర్షన్నస్మి । మామదన్తి అహమద్మి అన్యాన్ ॥**
**అహగ్ం సదమృతో భవామి । మదాదిత్యా అధి సర్వే తపన్తి ॥**

మరల అన్నదేవుని మహిమ ఈ మంత్రమందిట్లు వర్ణింపబడుచున్నది. నేను మేఘ స్వరూపడనై యుండి ఉరుముచూ వర్షిస్తున్నాను. యజ్ఞములలో అగ్నియందు హోమము చేయబడిన అన్నము సూక్ష్మరూపంలో సూర్యుని చేరుతోంది. సూర్యుడు తన యందు సంక్రమించిన సూక్ష్మ స్వరూపముతో మేఘమును సృష్టించగా, ఆ మేఘము వర్షిస్తోంది. ఈ రహస్యాన్ని

అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యాజ్జాయతే వృష్టిః । అను

శ్రుతి స్పష్టపరుచుచున్నది. అందుచేత అన్నదేవుడే మేఘ స్వరూపుడై వర్షిస్తున్నాడని భావము. అన్నదాతలు అన్నదానము చేసి అన్నమును భుజించుట ద్వారా నన్ను తినుచున్నారు. అదాతను నేనే తినుచున్నాను. అనగా అదాతను నశింప చేయుచున్నానని భావము. దాతలకు మరణము లేకుండునట్లు చేయుచూ దేవత్వమును సంపాదింప చేస్తున్నాను. అనగా అన్నదాతలకు స్వర్గాది లోకములలో అన్నము సిద్ధముగా ఉండుటచే వారికి మరణము లేదని భావము. మరియు నా మహిమను వినుదు అని అన్నదేవుడు ఇట్లు చెప్పు చున్నాడు. ద్వాదశాదిత్యులు బాగుగా ప్రకాశించుచున్నారంటే అది నా మహిమే. కారణమేమనగా అన్నము అగ్నిలో హోమము చేయబడగా అది వెంటనే సూక్ష్మరూపముతో సూర్యునికి చెందును. అందుకే ద్వాదశాదిత్యులు గొప్పతేజస్సు కలవారై ప్రకాశించుచున్నారు. లోకములో అన్నము తిన్నవారు బాగుగా పని చేయుదురు. తినని వారు నిస్తేజస్కులై ఉందురు. అట్లే సూర్యులు కూడా నా మహిమ వలననే గొప్పగా ప్రకాశించుచున్నారని అన్నదేవుడు తన మహిమను ప్రకటించి మనలను అన్నదానము చేయమని ప్రేరేపిస్తున్నాడు. కొందరు భక్తులు, దేవాలయాదుల వద్దనూ, అన్నదాన సత్రములందునూ నిత్యమూ అన్నదానం చేస్తూ అన్నదాన మహిమను బోధిస్తున్నారు.

ఇట్లు అన్నసూక్త విద్యారణ్య భాష్యమునకు ఆంధ్రానువాదము సమాప్తము.

డాక్టర్ విష్ణుభట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి

సలక్షణ ఘనపాఠీ. (MA, PhD)

సికింద్రాబాద్ - వేదభవనం

23-9-2004

★★★

విద్యారణ్య భాష్య మణి, వేద విభూషణ,
తర్కాచార్య
**కుప్పా శివసుబ్రహ్మణ్య అవధాని** M.A.(Triple)
ప్రిన్సిపాల్, S.V.V.S. పాఠశాల
కీసరగుట్ట.

# శుభాకాంక్ష

**మం ॥ ఇదం పితృభ్యో నమో అస్త్వద్య యేపూర్వాసోయ ఉపరాస ఈయుః**
**యేపార్థివే రజస్యా నిషత్తా యేవానూనగ్ం సువృజనాసువిక్షు**

**శ్లో ॥ అగ్నిహోత్రేచ దేవస్థాః, స్వర్గస్థావిప్రభోజనాత్**
**యమస్థాః పిండదానేన, వికిరాత్ నరకే స్థితాః (తృప్యన్తి)**

శ్రద్ధగా ఆచరించునది శ్రాద్ధము. సంతానమునకు జన్మనిచ్చి, విద్యాబుద్ధుల నేర్పించి, పుష్కలమైన ధనాన్ని అందించి, తాము అంతరించిపోతూ తమ పుత్రపౌత్రాదులను ప్రకాశింపచేయుట ప్రపంచంలో తల్లితండ్రులందరూ చేసేపని.

అట్టివారు గతించినపుడు భౌతికంగా గతంలోవలె కంటికి కనిపించకపోయినా, "పితృదేవత"లనెడి పేరుతో తమ వంశపరంపరకు అభివృద్ధి ఆకాంక్షిస్తూ వారు ఆయా లోకాల్లో విరాజిల్లుతూ ఉంటారు.

వారికి కృతజ్ఞత చూపించుట ఆయా మానవుల అవశ్యకర్తవ్యమై యున్నది. అందుకు భగవంతుడు వేదములద్వారా అందించిన నిర్దిష్ట ప్రణాళికయే "శ్రాద్ధ"మనగా.

ఇచట తల్లితండ్రులకేకాక, తనకు సంబంధితులై, గతించుటచే భౌతికంగా కనిపించని వారందర్నీ విధివిధానముగా సంతుష్టి పరచుటయే శ్రాద్ధమందు కర్త చేయుపని.

నిన్న నేడు కనపడదు. కానీ, నిన్నటిఫలం, నేడు, నీవనుభవిస్తున్నావు. నేడు, రేపటికి "నిన్న" అవుతుంది. ఆ రేపు, నేటి నిన్ను, గుర్తింపవలెనన్న, నీవు నేడు, "నిన్న"ను స్మరింపవలసియున్నది.

అనగా, శాశ్వతముగా, ఐహికాముష్మిక సుఖములనను భవింపగోరి, ఎంతో సాధించిన నీవు భౌతికంగా అశాశ్వతమై నిష్క్రమించినావు. ఇది ప్రపంచమున జీవులందరికినైజం. సముద్రంలోంచి ఒడ్డుకు చేరే అలల వంటిది ఈ స్థితి. మొదటి అలలోంచి 2 వ అలపుట్టింది. ఇపుడు మొదటి అల భౌతికంగా లేదు. 2 వ అలనుంచి అన్ని అలలూ అంతే. 2 వ అల మొదటి అలనుండి పుట్టింది కావున, మొదటి అలకు కృతజ్ఞత తప్పక తీర్చాలి. అదే లోకంలో మానవులు తమ పూర్వజులకు శ్రాద్ధమాచరించుటలో తాత్పర్యం.

ఏ మానవుడైనా, తన తల్లిదండ్రులను స్మరించి, వార్కి కృతజ్ఞత చూపితేనే, అతని సంతానం, అతనికి అట్టి కృతజ్ఞత చూపుతారు. కావున భౌతికంగా గతించినవారు పోనూ మిగిలిన వారందర్కి శ్రాద్ధం అవశ్య కర్తవ్యమైయున్నది.

ఈ విధానమంతా యథాశాస్త్రంగా తెలియపరచునదే ఈ గ్రంథం. ఇది మా విద్యార్థులకు 5 వ సంవత్సర స్మార్తపాఠ్య ప్రణాళికయేకాక, లోకంలో శ్రద్ధగా పితృ కార్యములాచరింపగోరు వారందర్కీ ఒక మణిదర్పణం.

ఇతిశమ్

**కుప్పాశివసుబ్రహ్మణ్య అవధానీ**

# శుభాశి శంసనమ్

**శ్లో ॥ త్వాం యోగిన శ్చిన్తయన్తి త్వాంయజన్తి చయ జ్వనః ।**
**హవ్య కవ్య భుగేకస్త్వం పితృదేవస్వరూప ధృత్ ॥**

*మహాశయులారా :*

సృష్టిలోనున్న ఎనుబది నాలుగు లక్షల జీవరాశులన్నియు పరమాత్మచే సంకల్పించబడినవే. అయితే ఆ జీవులు వారు, వారు చేసుకున్న ప్రారబ్ధవశముచే సుకృత, లేదా దుష్కృత కర్మలను ఆచరించుచున్నారు. అటులనే దుష్టకర్మలు ఆచరించినవారు రౌరవాది నరకములను పొంది దుఃఖించుచున్నారు.

**శ్లో ॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వం ఏషవోస్త్విష్ట కామధుక్ ॥**

పూర్వము బ్రహ్మదేవుడు ప్రజలతోపాటుగా యజ్ఞాది క్రతువులను సృష్టించెను. అపుడు ప్రజలను ఉద్దేశించి విధాత ఈవిధముగా పలికెను. ఓ ప్రజలారా నాచే సృజింపబడిన యజ్ఞములలో దేవతలకొరకు హవ్యమును పితృదేవతలకొరకు కవ్యమును సమర్పించినయెడల మీ అందరి కోరికలు సిద్ధించగలవు అని పలికెను. "యజ్ఞోవైవిష్ణు" ఇత్యాది వేదప్రమాణములచే ఆపరమేశ్వరుడే దేవరూపమున హవ్యమును పితృదేవరూపమున కవ్యమును (ఏకరూపముతోనే) స్వీకరించి పితృదేవతలకు ఉత్తమలోకములను మానవులమైన మన అందరకు ఆయురారోగ్యభోగ భాగ్యములను ప్రసాదించుచున్నాడు.

అందువలన అరిషడ్వర్గాదులను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు) జయించి సత్యగుణోపేతులైన మునులు, యోగులు, తపస్సుచేత యోగాభ్యాసముచేతనూ, కర్మాచరితులైనవారు. ఆపస్తంబమహర్షి మొదలుగాగల ఋషులచే నిశ్చయింపబడిన వైదికకర్మలు, యజ్ఞయాగాది క్రతువులను ఆచరించుచూ భక్తులు పూజా, జప, హోమ, అర్చనాదులచే పితృరూప దేవరూపములుకలసి ఏకరూపము పొందిన

పరమాత్ముని ధ్యానించి తరించుచున్నారు.

ప్రకృతమున మానవులు సుఖభోగములందిచ్ఛగలవారలై సజ్జనసాంగత్యము పొందక సత్కర్మలాచరింపక దుఃఖములను పొందుచున్నారు. మరికొంతమంది ఆస్తికులైన వారు అనేక సందేహములకు నివృత్తి చెప్పేవారు లేక, వారికి తోచక కర్మాచరణకు అశక్తులగుచున్నారు. మరికొందరు మా పిల్లవాని వివాహము (పుత్రికావివాహము) చేసినాము. ఆబ్దికము పెట్టవచ్చునా లేదా అని అడుగుచున్నాను యాజ్ఞకులు, ఆస్తికజనులైన యజమానుల సందేహాదులు తీర్చుచూ విహితకర్మానుష్ఠాన తత్పరులై "జ్ఞాత్వాకర్మాణి కుర్వీత" అనువచనమువలన కార్యక్రమధర్మమును నియమములను ప్రాశస్త్యమును తెలుసుకొని, తెలియచేయుచూ ధర్మవర్తనులు అగుదురని ఆశిస్తున్నాను.

విద్యనభ్యసించు విద్యార్థులకు సప్రయోగగ్రంథములు లభింపక, లభించిననూ సంస్కృత పరిచయములేక సమన్వయము చేసుకొనలేకున్నారు. ఈ పరిస్థితులలో మాసోదరుడు– చి॥ మార్తి వేంకట్రామశర్మ అచ్చటచ్చట విషయము ధర్మములు సేకరించి సంకలనముచేసి ఈ గ్రంథమును తయారు చేసినాడు. ఈ గ్రంథములోగల, విచ్ఛినౌపాసన, ఆబ్దిక, మాసిశ్రాద్ధ, తీర్థ, సంకల్ప, మహాలయ, షణ్ణవతి (96) శ్రాద్ధకాలములు, నియమములు. ధర్మములు అన్ని ఆమూలాగ్రము నేనుచూచి మహానంద భరితుడనైతిని. ఇటువంటి గ్రంథములు ప్రస్తుత తరుణములో చాలా ఆవశ్యకము గావున ఇకముందు ఇంకా పంచదశకర్మలు వగైరా గ్రంథములు సప్రయోగ, కారికా సహితము సంకలనము చేయుటకు మాసోదరునకు ఆయురారోగ్య శక్తి సామర్థ్యములను శ్రీశ్రీనివాసప్రభువు సమకూర్చి రక్షించమని శ్రీస్వామిని ప్రార్థిస్తూ సోదరుడైన చి॥వేంకట్రామశర్మకు శుభాశీస్సులందజేయు చున్నాను.

ఇతిశమ్.

ఇట్లు
**మార్తి వేంకటలక్ష్మీ నరసింహశాస్త్రి**
స్మార్తాధ్యాపకః
S.V.V.S.పాఠశాల,
కీసరగుట్ట – 501301.

# అభివాదనపూర్వక ప్రశంసా

**నమస్తేహం పితౄన్ శ్రాద్ధే యే వసన్త్యధి దేవతాః ।**
**దేవైరపి హి తర్ప్యన్తే యేచ శ్రాద్ధే స్వధోత్తరైః ॥**

పితృదేవతలను తృప్తి పరచుట గృహస్థుని ధర్మములో ప్రధానమైన ధర్మము. పితృకర్మలను ఆచరించని గృహస్థునకు సద్గతులు లభింపవు.

స్వాహాకారములతో దేవతలను, స్వధా అని ఉచ్చరించుటవలన పితరులను, అన్నదానము ద్వారా అతిథులను సేవించి, తన జన్మకారణమువలన సిద్ధించిన ఋణములను తీర్చుకొను పురుషుడే నిజమైన గృహస్థుడగును. ఆ విషయమే మార్కణ్డేయ పురాణములో–

**"గృహీ సమస్త దేవానాం పితౄణాంచ తథార్ష్ణామ్**
**ఋషీణామతిథీనాంచ కుర్వన్ లోకానుపాశ్నుతే"**
**స్వాహోచ్చారణతో దేవాన్ స్వధోచ్చారణతః పితౄన్ ।**
**విభజన్నన్నదానేన భూతాద్యానతిథీనపి ॥ ఇతి–**

విహిత కర్మలను ఆచరింపక, ముక్తికొరకు ఇంద్రియనిగ్రహములను చేయు అసత్‌పురుషుడు అన్త్యకాలమున ముక్తినిపొందక అధోగతి పాలగును. మోక్షప్రాప్తికి కర్మయే ప్రధానహేతువు. పితృకార్యమును ఆచరింపనిచో పితరులకు పతనము. ఆచరింపనివానికి అధోగతియుకలుగును.

పూర్వము 'రుచి' అనుపేరుగల ప్రజాపతి ఆశ్రమహీనుడై సఙ్గత్యాగియై సంచరించుచుండగా అతనిని చూచి పితృదేవతలు – "గృహస్థాశ్రమమును స్వీకరించి తద్వారా తమ ఋణమును తీర్చుకుని సద్గతిని పొందమని హితవు పలికిరి. "ప్రజయా **పితృభ్యః**" అను వేదవాక్యముననుసరించి, నిజమగు మోక్షహేతువును తెలుసుకొనిన 'రుచి' తదేకదీక్షతో బ్రహ్మదేవుని ఆరాధించెను. అతని తపస్సునకు మెచ్చిన బ్రహ్మ ప్రత్యక్షమై **'పితృపూజ'** చేయవలసినదిగా ఆజ్ఞాపించెను.

అంతట వృద్ధుడగు రుచి ఏకాగ్రచిత్తుడై పితృదేవతలను ఇట్లు స్తోత్రము చేసెను.

**"నమస్యేఽహం పితౄన్మర్త్యైరర్చ్యన్తే భువి యే సదా ।**
**శ్రాద్ధేషు శ్రద్ధయాఽభీష్టలోకప్రాప్తి ప్రదాయనః ॥ అనగా-**

"భూలోకమునందలి జనులు శ్రాద్ధకర్మ చేయగా అట్లు చేసినవారికి అభీష్ట ఫలమునిచ్చు పితృగణమునకు నమస్కారము. అట్లే పుత్ర, పశు, అర్థ, బల, గృహాదికములగు కోర్కెలను తీర్చు పితృదేవతలకు నమస్కారము. అమఙ్గళములను నాశము చేయుచూ సురేశ్వరునిచే పూజింపబడు-పితృదేవతలకు నమస్కారము."

ఈ విధముగా 'రుచి'చే స్తుతింపబడిన పితృదేవతలు అతని ఎదుట ప్రత్యక్షమై గృహస్థుకావలయునన్న అతని కోర్కెను మన్నించిరి. పితృదేవతల యొక్క అనుగ్రహముచే సున్దరాకారుడైన 'రుచి' 'మాలిని' అనుకన్యను విధి విధానముగా పాణిగ్రహణము చేసెను. ఆ దంపతులకు రౌత్యుడను మనువు జన్మించెను.

కావున పితృదేవతలయొక్క ఆరాధనచేత ఐహికాముష్మికములగు కోర్కెలు నెరవేరగలవు. ఇట్టి మహత్తరమగు పితృకర్మల యొక్క విధివిధానమును వివరించు గ్రంథము గౌరవనీయులు, సోదరతుల్యులు, ఆత్మీయులగు బ్రహ్మశ్రీ మార్తి వేంకట్రామ శర్మగారిచే సఙ్కలితమై ప్రజోపయోగైక సాధనముగా పుస్తకరూపమున ప్రకాశించుట, సత్కర్మాచరణయందు ఆసక్తికల సజ్జనులకు ఎంతో ఆనందకరమగు విషయమనుటలో సన్దేహలేశమైననూ కానరాదు.

వారు మరిన్ని గొప్ప గ్రన్థములను ప్రజలకు అందించవలెనని ఆకాంక్షిస్తూ, వారి ఆశీస్సులను కోరుతూ-

బుధజన విధేయుడు,
**కె.వి.ఎస్.వి.జి.శేషాచార్యులు,**
సంస్కృతాధ్యాపకుడు, grade - II,
ఎస్.వి.వి.ఎస్. పాఠశాల,
కీసరగుట్ట.

# విచ్ఛిన్నౌపాసనమ్

ఆచమ్య....ఏవం ప్రీత్యర్థం, శ్రీమాన్...గోత్రః......నామధేయః ధర్మ పత్నీ సమేతోహం మమ అనుగత స్యాగ్నిం పున స్సంధాస్యే ।

యత్రాగ్ని స్థాప్యతే తత్ర శ్వేత తండుల చూర్ణేన ప్రాదేశ మాత్రం స్థండిలం కల్ప యిత్వా । తత్ర దర్భాభ్యాముల్లిఖ్య । ప్రాచీః పూర్వము దక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్ । అథోదీచీః పురస్సం స్థం పశ్చిమారం భ మాలి ఖేత్ ॥ అవాక్కరోఽభ్యుక్ష్య నిధాయ వహ్నిం, ఉత్సిచ్యతేఽవోక్షణ తోయశేషం ।

(అగ్నిని స్థాపించు ప్రదేశమును గోమయాదులతో శుద్ధిచేసి బియ్యపుపిండితో ముగ్గువేసి అలంకరించి రెండు దర్భల మొదళ్లతో పశ్చిమమునుండి తూర్పుకు దక్షిణ భాగములోనూ, మధ్యలోనూ రెండుగీతలు గీసి, ఇక అగ్రములతో ఉత్తర భాగములోనూ, దక్షిణము నుండి ఉ త్తరమునకు, పశ్చిమ, మధ్య, తూర్పు భాగములలోనూ రేఖలు గీసి అక్షత, దర్భలతో ఉదకములను తీసుకొని స్థండిలముపై అక్షతో దకమును చల్లి, దర్భలు చేతిలో ఉంచుకొని అగ్నిని స్థండిలమందు ప్రతిష్ఠించి, ఆ పాత్రలోమరల అక్షతోదకమును చల్లి రేఖలుగీసిన దర్భలు చీల్చినైరృతి దిక్కున పడవేసి నీరు స్పృశింపవలెను)

ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా । యథా బహిస్యాచ్చ పరిస్తరాణాం, అగ్నిమిధ్వా । ఓంభూర్భువస్సువరోం । చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తా సో అస్య । త్రిధా బద్ధో వృషభోరోరవీతి మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ

ధ్యానమ్ ॥ సప్తహస్తశ్చతుశ్శృంగ స్సప్తజిహ్వోద్విశీర్షకః । త్రిపాత్ప్రసన్న వదన స్సుఖాసీన శ్శుచిస్మితః ॥ స్వాహాంతు దక్షిణే పార్శ్వే దేవీం వామేస్వధాంతథా।

బిభ్రద్దక్షిణ హస్తైస్తు శక్తిమన్నం సృచం సృవం ॥

తోమరం వ్యజనం వామైర్ఘృత పాత్రన్తు ధారయన్। మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసం । ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చి స్సర్వకామదం । ఆత్మాభిముఖమాసీనం ఏవం ధ్యాయే ద్ధుతాశనం ॥

మం॥ ఏషహిదేవః ప్రదిశోను సర్వాః పూర్వోహిజాతస్సఉగర్భేఅన్తః । సవిజాయ మానస్సజనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతో ముఖః ॥ ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖో భవ । సుముఖో భవ । సుప్రసన్నోభవ । యథోక్త జిహ్వయాహవిర్గృహాణ । సోదకేన పాణినాప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్య । అగ్నిమలంకృత్య । (అగ్నిని సమిధలచే ప్రజ్వలింపచేసి ధ్యానించి, ఏషహిదేవః అను మంత్రాంతమున అక్షతోదకమును అగ్నికి తూర్పు భాగమున వదలి తనకు అభిముఖునిగా ఉండమని ప్రార్థించి, గాయత్రీ మంత్రముతో అగ్ని చుట్టూ తూర్పునుండి ప్రదక్షిణముగా అలికి, పుష్పాక్షతలను తూర్పుగా గల ఎనిమిది దిక్కులయందు ఉంచవలెను) ఓం భూర్భు వస్సువః .... ప్రచోదయాత్ – ఓం అగ్నయేనమః, ఓం హుత వహాయనమః, ఓం హుతాశనేనమః ఓం కృష్ణ వర్త్మనే నమః, ఓం దేవముఖాయనమః, ఓం సప్తజిహ్వాయనమః, ఓం వైశ్వానరాయనమః ఓం జాతవేదసే నమః । దర్భైరగ్నిం ప్రాగాదిప్రదక్షిణం పరిస్తృణాతి । పురస్తాత్ । దక్షిణతః । పశ్చాత్ । ఉత్తరతః । ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాన్

సగ్గ్‌స్తీర్య। ద్వంద్వంన్యంచి పాత్రాణి ప్రయునక్తి। దర్వ్యాజ్యస్థాల్యౌ। ప్రోక్షణస్రువావితి।

(అగ్నికి తూర్పునుండి నాల్గు దిక్కుల దర్భలను పరచవలెను – దక్షిణమున ఉన్న దర్భలు పైకి, ఉత్తరమున ఉన్న దర్భలు క్రిందకి వచ్చునట్లుగా వేయవలెను– ఉత్తర పరిస్తరణము ప్రక్కన మరల దర్భలను పరిచి రెండువరుసలలో, స్రుక్, ఆజ్యస్థాలియు, స్రువము, ప్రోక్షణపాత్రను ఆసాదించవలెను– ఇవి రెండు రెండుగా ఉంచవలెను.) సమౌ సాగ్రౌ ద్వౌదర్భౌ ప్రాదేశమాత్రౌ పవిత్రేకురుతే। తృణం కాష్ఠంవా అంతర్ధాయ ఛినత్తి। నన ఖేన। అపఉపస్పృశ్య। మూలాదారభ్య అగ్రాదద్భిరను మృజ్య। ప్రోక్ష్య, ప్రోక్షిణ్యామవధాయ। తస్యామక్షతై స్సహ అప ఆనీయహస్త యో రంగుష్ఠోప కనిష్ఠిభ్యాం ఉత్తా నాభ్యాముదగగ్రే గృహీత్వా ప్రాచీస్త్రిరుత్పూయ। (రెండు దర్భలను తీసుకొని వేలుముడివేసి జానెడు ప్రమాణము ఉండులాగున దర్భ, కట్టెముక్క మొదలగు సాధనముతో ఛేదించి, నీరు ముట్టుకొని, మొదళ్లనుండి అగ్రము దాకా పవిత్రమును కడిగి, ప్రోక్షణ పాత్రను ప్రోక్షించి ఉత్తర దిక్కునుండి తిరుగదీసి ఆ పవిత్రమును పాత్రయందుంచి అక్షతోదకమును ఆపాత్రలో పోసి బొట్టనవ్రేళ్లు, ఉంగరపు వ్రేళ్లతో ఆపవిత్రమును ఉదగగ్రముగా, ఆచివర ఈచివర పట్టుకొని ఆముడిని నీటిలో తూర్పునకు, కెరటములు వచ్చునట్లుగా కదల్చవలెను.)

సపవిత్రేణ పాణినా పాత్రాణి సంస్పృశ్య। పాత్రాణ్యుద క్రృవణముత్తానాని కృత్వా। త్రిఃప్రోక్ష్య। ప్రోక్షణశేషం దక్షిణతో నిధాయ। సపవిత్రమాజ్యస్థాలీమాదాయ। ఆజ్యం విలాప్య। ఆజ్యం నిరుప్య। ఉదీచోంగారాన్నిరూహ్య తేష్వాజ్యమధి శ్రిత్య।

(పిమ్మట పవిత్రమును కుడిచేతి యందుంచుకొని స్రుక్, ఆజ్యపాత్ర, స్రువములను స్పృశించి, అపాత్రలను ఉత్తర దిక్కునుచూచునట్లుగా తిరుగదీసి, ప్రోక్షణ పాత్రోదకమును కుడిచేతితో మూడు పాత్రములపై మూడుసార్లు ప్రోక్షించి, మిగిలిన ప్రోక్షణోదకమును అగ్నికి దక్షిణ భాగమున ఉంచి, పవిత్రము చేతిలో ఉంచుకొని ఆజ్యపాత్రను ప్రదక్షిణముగా అగ్నికి పశ్చిమభాగమున ఉంచి, నేతిని కరగబెట్టి, ఆజ్యస్థాలియందు పవిత్రమును ఉంచి నేతిని పోసి, అగ్నిలో ఉత్తరభాగమునందున్న నిప్పుకణికలు 4కి తక్కువగాకుండా తీసుకువచ్చి అగ్నికి పడమట యందుంచి ఆ నిప్పులపై ఆజ్యస్థాలిని ఉంచి, దర్భాగ్రములను, దర్భ, కట్టెముక్క, మొదలైన సాధనముతో త్రుంచి, కడిగి, తుడిచి ఆదర్భఖండములను ఆజ్యపాత్రయందు వేయవలెను.)

జ్వలతా తృణే నాథో గామిన్యా దీప్యా । ఆజ్యేప్రతి ఫలీకృత్య । ద్వేదర్భాగ్రే తృణ మంతర్ధాయ ప్రచ్ఛిద్య, అపఉపస్పృశ్య, ప్రక్షాళ్య, ప్రత్యస్య, ఆజ్యే ప్రాశ్య । త్రిః పర్యగ్నికృత్వా, ఉదగుద్వాస్య । అంగారాన్ప్ర త్యూ హ్య । ఉదగగ్రాభ్యాం పవిత్రా భ్యాం పునరాహార మాజ్యం త్రిరుత్పూయ । పవిత్రగ్రన్థిం విస్రస్య, ప్రక్షాళ్య, ప్రాగగ్రమగ్నౌ పవిత్రే అను ప్రహరతి । స్రుక్ స్రువా వగ్నౌ ప్రతితప్య । దర్భాగ్రై స్సంమృజ్య, పునః ప్రతితప్య, ప్రోక్ష్య, స్రువముత్తరతో నిధాయ । దర్భానద్భి స్సగ్ స్పృ శ్యాగ్నౌ ప్రహరతి । అగ్నిం పరిషించతి । అదితేను మన్యస్వ । అనుమతేను మన్యస్వ సరస్వతేను మన్యస్వ ।దేవ సవితః ప్రసువ । (ఒక దర్భను వెలిగించి ఆజ్యపాత్రచుట్టూ ప్రదక్షిణముగా ముమ్మారు త్రిప్పి పారవేసి, ఆజ్యపాత్రను నిప్పులమీదనుండి

ఉత్తరపువైపుకు దించి, ఆ నిప్పులను అగ్నిలో వేయవలెను. మరల ఉంగరపు వ్రేళ్లు, బొటనవ్రేళ్లతో పవిత్రమును పట్టుకొని నేతిలో తూర్పునుండి పశ్చిమమునకు మరల తూర్పువరకు కెరటములు వచ్చులాగున మూడుసార్లుచేసి, ఆపవిత్ర ముడిని విప్పి కడిగి తూర్పు అగ్రముగా ఉండునట్లు అగ్రమును కాల్చి పిమ్మట దర్భలను అగ్నిలో వేసి, అగ్నికి పరిషేచన చేయవలెను. అగ్నికి నిర్‌ఋతినుండి ఆగ్నేయమువరకు, నిర్‌ఋతినుండి వాయవ్యమువరకు, వాయవ్యమునుండి ఈశాన్యమువరకు, ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా మరల ఈశాన్యము వరకు నీరును ధారగా పోసి తరువాత హోమము చేయవలెను.)

ఏకం, ద్వే, త్రీణి, చత్వారి. ఓం భూర్భు వస్సువ స్స్వాహా । ప్రజాపతయ ఇదం నమమ। మమ అగ్న్యను గమన ప్రాయశ్చిత్తార్థం ఉపవాస స్థానే అయాశ్చ హోమం కరిష్యే । ఓం అయాశ్చాగ్నేస్య నభి శస్తీశ్చ సత్యమిత్వమయా అసి । అయసా మనసా ధృతో యసా హవ్యమూహి షేయానో ధేహి భేషజగ్గ్ స్వా హా । అయసే అగ్నయ ఇదం నమమ । మమ అనేక కాల ఔపాసనాంతరిత లోప ప్రాయశ్చిత్తార్థం పునరౌపాసనాధికార సిధ్యర్థం, సప్తహోతారం హోష్యే । ఏకం, ద్వే త్రీణి, చత్వారి, ఓం మహా హవిర్ హోతా । సత్యహవి రధ్వర్యుః । అచ్యుతపాజా అగ్నీత్ । అచ్యుత మనా ఉపవక్తా । అనాధృష్యశ్చా ప్రతిధృష్యశ్చ యజ్ఞస్యాభిగరౌ । అయాస్య ఉద్గాతా। వాచస్పతే హృద్విధే నామన్ । విధేమతే నామ । విధేస్త్వ మస్మాకం నామ । వాచస్పతి స్సోమ మపాత్ । మాదైవ్యస్తం తుశ్ఛేది మా మనుష్యః । నమోదివే । నమః పృథివ్యై స్వాహా॥ వాచస్పతయే బ్రహ్మణ ఇదం నమమ । సర్వప్రాయశ్చిత్తం కరిష్యే । ఓం

భూర్భు వస్సు వస్స్వా హా । ప్రజాపతయ ఇదం నమమ ॥ అదితేన్వమగ్గ్ స్థాః । అనుమతే న్వ మగ్గ్స్థాః । సరస్వతే న్వమగ్గ్స్థాః । దేవ సవితః ప్రాసావీః ।

(ముందుగా చతుర్ గృహీతాజ్యముతో ఓంభూర్భువస్సువ స్స్వాహా అనెడి హోమముచేసి, పిమ్మట అయాశ్చ హోమము చేయవలెను స్మార్తాగ్ని విచ్ఛిన్నమైనందుకు ప్రాయశ్చిత్తము ఉపవాసము - ఉపవాసము చేయలేనప్పుడు ఈ అయాశ్చహోమమైనా ప్రాయశ్చిత్తముగా చేయవలెను-పిమ్మట అనేక ఔపాసనలోప ప్రాయశ్చిత్తముగా సప్తహోత మంత్రముతో హోమము చేసి మరల సర్వప్రాయశ్చిత్తము చేసి ఉత్తర పరిషేచన చేసి కర్మను భగవదర్పణచేసి, పిమ్మట ప్రాతరౌపాసన చేసుకోవలెను-)

అనేన విచ్ఛిన్నౌపాసన హోమేన భగవాన్ సర్వాత్మకః పరమేశ్వర స్సుప్రీణాతు । ఏతత్ఫలం పరమేశ్వరార్పణ మస్తు ॥ స్వస్తి ॥ శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాంబుద్ధిం శ్రియబలం । ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన॥ శ్రియం దేహిమే హవ్య వాహన ఓన్నమఇతి. యస్యస్మృత్యాచ నామోక్త్యా తపోహోమ క్రియాదిషు । న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతం ॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన । యద్ధుతంతు మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥ చతుస్సాగర పర్యంతం......అహంభో అభివాదయే ॥



# ప్రాతరౌపాసనమ్

ఆచమ్య.....ఏవం ప్రీత్యర్థం శ్రీమాన్....గోత్రః....నామధేయః ధర్మపత్నీ సమేతో హం మమోపాత్త దురిత క్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతరౌపాసన హోమం తండులైర్హోష్యే। (అని సంకల్పించి అగ్నిలో ఓం భూర్భువస్సువరోం- అని సమిధనుంచవలెను)

ఓంచత్వారిశృంగా....ఓంజాతవేదసే నమః-అలంకరణాంతం కృత్వా (విచ్ఛిన్నౌపాసనలో చెప్పిన విధముగా అగ్నిధ్యానము, పరిసమూహనము, అలంకరణ వరకూ క్రమముగాచేసి పూర్వపరిషేచన చేయవలెను.)

ఓం అదితేను మన్యస్వ....దేవసవితః ప్రసువ। తండులానాదాయ। ద్వేధా విభజ్య। మధ్యే గ్నౌ జుహోతి। ఓం సూర్యాయస్వాహా। సూర్యాయేదం నమమ। అథ ఐశాన్య భాగే జుహోతి। ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా। అగ్నయే స్విష్టకృత ఇదం నమమ। ఆహుతి సంసర్గ దోష నిర్ హరాణార్థం వనస్పతి హోమం కరిష్యే ఓం యత్ర వేత్థ వనస్పతే దేవానాం గుహ్యా నామాని। తత్ర హవ్యాని గామయ। వనస్పతయ ఇదం నమమ। అదితేన్వమగ్గ్స్థాః। అనుమతే న్వమగ్గ్స్థాః। సరస్వతేన్వ మగ్గ్స్థాః। దేవ సవితః ప్రాసావీః।

(మొదటి హోమమును అగ్నిమధ్యలో చేయవలెను- రెండవది అగ్నిలో ఈశాన్యభాగమున చేయవలెను. ఈహోమములలో బియ్యమును అరచేతితో ఎడమ ప్రక్కనుండి అగ్నిలోపడునట్లు వేయవలెను- పైరెండు ఆహుతులు కలవకూడదు.

కలిసినచో యత్రవేత్థ అనుమంత్రముతో సమిధను అగ్నియందుంచి ఉత్తరపరిషేచన చేసి ఉపస్థానము చెప్పవలెను– ఉపస్థానమనగా నిలబడి ధ్యానించుట అని అర్థము.)

## ఉపస్థానమ్

ఓం అగ్నే త్వన్నో అంతమః । ఉతత్రాతా శివోభవ వరూధ్యః । తంత్వాశో చిష్ఠదీదివః । సుమ్నాయ నూన మీమహే సఖిభ్యః । వసురగ్ని ర్వసుశ్రవాః । అచ్ఛానక్షి ద్యుమత్త మో రయిందాః । సనోబోధి శృధీహవమురు ష్యాణో అఘాయ తస్సమస్మాత్ । హోమసాద్గుణ్యార్థం అనాజ్ఞాత త్రయమంత్ర జపంకరిష్యే । (ఈ క్రింది 3 మంత్రములు జపించవలెను)

1. ఓం అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు ।
   అగ్నే తదస్య కల్పయత్వగ్ం హి వేత్థ యథాతథమ్ ।
2. పురుష సమ్మితో యజ్ఞోయజ్ఞః పురుష సమ్మితః ।
   అగ్నేతదస్య కల్పయత్వగ్ంహి వేత్థయథాతథమ్ ॥
3. యత్పాకత్రా మనసా దీన దక్షాన యజ్ఞస్య మన్వతే మర్తాసహ ।
   అగ్నిష్టద్ధోతా క్రతు విద్వి జానన్యజిష్ఠో దేవాగ్ం ఋత శో యజాతి ।

అనేన ప్రాతరౌపాసన హోమేన భగవాన్ సర్వాత్మకః పరమేశ్వర స్సుప్రీణాతు । ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు స్వస్తి ॥ శ్రద్ధాంమేధాం...అహంభో అభివాదయే.

ఇత్యౌపాసన విధిః

# ఆబ్దిక ప్రయోగః

**॥ శ్రీ మహాగణాధిపతయేనమః ॥ ॥ శ్రీ మహాసరస్వత్యై నమః ॥**

**॥ శ్రీ గురుభ్యోనమః॥ ॥హరిః ఓమ్॥**

ఆదౌ దీపారాధనం కారయిత్వా

ఆచమ్య – ఓం కేశవాయస్వాహా – శ్రీ కృష్ణాయనమః

కర్తా పవిత్రం ధృత్వా ॥

ఓం పవిత్రవన్తః పరివాజ మాసతే । పితైషాం ప్రత్నో అభిరక్షతి వ్రతం ।

మహ స్సముద్రం వరుణ స్తిరో దధే । ధీరా ఇచ్ఛే కుర్ధరుణే ష్వారభం ।

పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే । ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః ।

అతప్త తనూర్నత దామో అశ్నుతే । శృతాస ఇద్వహన్త స్తత్సమాశత ।

పవిత్రం ధృత్వా ॥

త్రిరాచామేత్ । ద్విఃపరిమృజ్య సకృదుపస్పృశ్య ।

యత్సవ్యం పాణిం పాదౌప్రోక్షతి శిర శ్చక్షుషీ నాసికే శ్రోత్రే ।

అపఉపస్పృశ్య ॥

ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః ఏతే భూమిభారకాః ।

ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

ఓం భూః, ఓంభువః, ఓగ్ంసువః, ఓంమహః, ఓం, జనః, ఓం, తపః, ఓగ్ం సత్యం, తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం ॥

శ్రీ గోవింద గోవింద శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ............ వాసరే శ్రీవిష్ణు నక్షత్రే శ్రీవిష్ణుయోగే శ్రీవిష్ణుకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం। పుణ్యతిథౌ ॥

ప్రాచీనావీతీ । అస్మత్ పితుః (మాతుః) ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం కరిష్యే । సవ్యం (ద్వితీయ మాసాను మాసికాఖ్యాన్న శ్రాద్ధం కరిష్యే ।) (అని మాసికాదులందు సంకల్పము, సవ్యముగా జలము వదలవలెను) కురుష్వ। (అని భోక్తలు పలుకవలయును)

కాలేఅధికార సిద్ధ్యర్థం యథాశక్తి సంభవత్ పరిషత్ ప్రాయశ్చిత్తం కరిష్యే ॥

తిలదర్భ హిరణ్యాక్షతాన్ గృహీత్వా ఆత్మప్రదక్షిణ త్రయం కృత్వా ॥ (దర్భలు పైసలు తిలలు అక్షితలు తీసుకొని ముమ్మారు ప్రదక్షిణం చేయవలయును)

1. సమస్త సంప త్సమవాప్తి హేతవ స్సముత్థితాపత్కుల ధూమ కేతవః ।
   అపార సంసార సముద్ర సేతవః పునన్తుమాం బ్రాహ్మణ పాద పాంసవః ॥

2. ఆపద్ఘ నధ్వాంత సహస్రభానవ స్సమీహితార్థార్పణ కామధేనవః ।
   సమస్త తీర్థాంబు పవిత్రమూర్తయో రక్షన్తుమాం బ్రాహ్మణ పాదపాంసవః ॥

3. ఆధివ్యాధి హరం నృణాం మృత్యు దారిద్ర్య నాశనమ్ ।
   శ్రీ పుష్టి కీర్తిదం వందే విప్రశ్రీ పాద పంకజమ్ ॥

4. విప్రౌఘు దర్శనా త్సద్యః క్షీయ న్తే పాపరాశయః ।
   వందనా న్మంగళావా ప్తి రర్చనా దచ్యుతం పదమ్ ॥

5. నమో బ్రహ్మణ్య దేవాయ గో బ్రాహ్మణ హితాయచ ।
   జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః ॥

(అని ప్రదక్షిణ త్రయము గావించి ఈ క్రింది మన్త్రములతో భోక్తలకు నమస్కరించవలయును.)

మం॥ యావతీర్వై దేవతా స్తా స్సర్వా వేదవిది బ్రాహ్మణే వసన్తి తస్మాద్బ్రాహ్మణేభ్యో వేద విద్భ్యో దివే దివే నమస్కుర్యాన్నాశ్లీలం కీర్తయే దేతా ఏవ దేవతాః ప్రీణాతి॥

ప్రాచీనావీతీ । అస్మత్పితుః (మాతుః) ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం కర్తుం ముఖ్యకాలో భూత్వా అధికార సంపదస్త్వితి భవన్తో బ్రువన్తు । కర్తుం అధికార సంపదస్తు । (అని భోక్తలు పలుకవలయును) ॥సవ్యం॥

| **కర్తృవచనమ్** | x | **భోక్తృవచనమ్** |
|---|---|---|
| కాలశ్చ | x | ముఖ్య కాలో అస్తు |
| పాకాదీనాం | x | పవిత్రతాస్తు |
| సర్వాణి పాకాని | x | శుచీని భవన్తు |

శ్లో॥ దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ ।
నమస్స్వాహాయై స్వధాయై నిత్యమేవ నమోనమః ॥

శ్లో॥ ఈశానః పితృరూపేణ మహాదేవో మహేశ్వరః
ప్రీయతాం భగవానీశః పరమాత్మా సదాశివః (హరిః) ॥

శ్లో॥ తిథిర్విష్ణు స్తథావారో నక్షత్రం విష్ణురేవచ ।
యోగశ్చ కరణం చైవ సర్వం విష్ణుమయం జగత్॥

ఓం, ఓం, ఓం, అద్య......విశిష్టాయాం పుణ్యతిథౌ ॥

॥ప్రాచీనావీతీ ॥ అస్మత్పితుః ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే

అస్మత్ పితృ పితామహ ప్రపితామహానాం గోత్రాణాం, శర్మణాం ॥

(మాతృ, పితామహి, ప్రపితామహీనాం గోత్రాణాం, దాయీనాం)

వసురుద్ర ఆదిత్య రూపాణాం ॥సవ్యం॥

పురూర వార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాఞ్చ ॥

ప్రాచీనావీతీ ॥

పితుః ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం అన్నేన హవిషా పార్వణ విధానేన యుష్మదనుజ్ఞయా సదైవం అద్య కరిష్యే । సవ్యం । కురుష్వ ।

ప్రాచీనావీతీ ।

పితుః ప్రతిసాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం భవిష్యతీత్యత్ర భవిష్యతి

(అని దర్భను రెండు ముక్కలుగా గ్లాసు సహాయముతో చేయవలయును)

॥సవ్యం॥ హస్తోదకం దత్వా॥

పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాంస్థానే

ఆవహనీయార్థే క్షణం ధృత్వా భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః॥

అస్తు కరణీయః (అని భోక్త చెప్పవలయును) ॥

ప్రాచీనావీతీ॥ అస్మత్ పితృపితామహ ప్రపితామహానాం గోత్రాణాం... శర్మణాం, వసు రుద్ర ఆదిత్య రూపాణాం స్థానే ఆవహనీయార్థే క్షణంధృత్వా భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః (అని పితృస్థాన భోక్తకు తిలలు శిరమున చల్లి దర్భలు ఇవ్వవలయును) ।

అస్తుకరణీయః । (అని భోక్త చెప్పవలయును) ॥

(అస్మత్ మాతృ, పితామహి, ప్రపితామహీనాం...... గోత్రాణాం...... పదానాం, వసురుద్ర ఆదిత్యరూపాణాం స్థానే ఆవహనీయార్థే క్షణం ధృత్వా భవద్భిః

క్షణః ప్రసాదః కరణీయః, అస్తుకరణీయః ॥సవ్యం॥)

శ్లో॥ అక్రోధనైశ్శౌచపరైః సతతం బ్రహ్మావాదిభిః ।
భవితవ్యం భవద్భిశ్చ మయాచ శ్రాద్ధకర్మణి ॥

శ్లో॥ మన్త్ర మధ్యే క్రియా మధ్యే విష్ణోః స్మరణ పూర్వకం ।
యత్కించి త్క్రియతే కర్మ తత్కోటి గుణితం భవేత్ ॥

విష్ణుర్విష్ణు ర్విష్ణుః ।

గృహాంగణే గోమయేన (గంధేన) మన్డల ద్వయం కృత్వా ।

ఉత్తరే చతురశ్ర మన్డలం ।

దక్షిణే ప్రాచీనావీతినా వర్తులాకార మన్డలం కృత్వా ।

(గృహమునకు బయట ప్రదేశమున, గోమయముతోగానీ గంధముతోగానీ సవ్యముగా ఎడమచేతి వైపున చతురశ్రముగానూ, కుడివైపు గుండ్రముగా అలికి తానుతూర్పుముఖముగా కూర్చుండి ఈ క్రియలతో మన్డలములమీద అర్చనచేయవలయును.)

॥సవ్యం॥

పురూర వార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం పాద్యస్థానే ఇదమాసనం।

పాద్యస్థానే కుశాసనం । పాద్యస్థానే దైవేక్షణః క్రియతాం । అమీగంధాః ।

పుష్పార్థా ఇమేఅక్షతాః । అమీకుశాః ।

పాద్యస్థానే సకలారాధనైః స్వర్చిత మస్తు ।

॥ప్రాచీనావీతీ॥ అస్మత్ పితృపితామహ ప్రపితామహానాం (మాతృ, పితామహి, ప్రపితా మహీనాం) పాద్యస్థానే ఇదమాసనం। పాద్యస్థానే కుశాసనం ।

పాద్యస్థానే శ్రాద్ధేక్షణః క్రియతాం । అమీ గంధాః ।

పుష్పార్ఘా ఇమే తిలాః । అమీకుశాః ।

పాద్యస్థానే సకలారాధనైః స్వర్చితమస్తు । సవ్యం ।

కర్తా ప్రత్యఙ్ముఖోభూత్వా ।

(కర్త మన్డలమునకు తూర్పు భాగమున పశ్చిమముఖముగా కూర్చుండి)

పురూర వార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః । స్వాగతం ।

సుస్వాగతమితి భోక్తావదేత్ ।

పురూర వార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః ఇదం వః పాద్యం ఇదంవః పాద్యం ।

సుపాద్యమితి భోక్తావదేత్ ।

శంన్నో దేవీరితి మన్త్రేణ కర్తా పాద్యోదక మభి మన్త్ర్య ॥

(శంనో దేవీ అనెడి మన్త్రముతో పాదప్రక్షాళనార్థమైన జలకలశమును కర్త అభిమన్త్రించవలెను)

మం॥ శంన్నో దేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే । శంయోరభిస్రవన్తునః ।

కర్తాపవిత్రం కర్ణే నిధాయ ॥

చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని ।

తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతిపాప్మాన మరా తింతరేమ ।

లోకస్యద్వార మర్చిమత్పవిత్రం జ్యోతిష్మద్భ్రాజ మానం మహస్వత్ ।

అమృతస్య ధారా బహుధా దోహమానం చరణం

నో లోకే సుధితాం దధాతు ॥

శ్లో॥ నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయచ ।

జగద్ధితాయ కృష్ణాయ గోవిన్దాయ నమో నమః ॥

కర్తాపవిత్రం ధృత్వా ।

శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవ స్సవితోత్పునా త్వచ్ఛిద్రేణ
పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః॥

కర్తా భోక్తృపాదప్రక్షాళనోదకం శిరసి ధృత్వా ।

## అథ పితృస్థాన భోక్తుః పాదప్రక్షాళనం

అస్మత్ పితృపితామహ ప్రపితామహాః ।

(మాతృ పితామహి ప్రపితామహ్యాః) స్వాగతం ।

సుస్వాగతమితి భోక్తృ ప్రతివచనం । ప్రాచీనావీతీ ।

అస్మత్పితృపితామహ ప్రపితామహాః (మాతృ పితామహి, ప్రపితామహ్యాః)

గోత్రాః.... శర్మాణః (గోత్రాః....... పదాః)

వసురుద్ర ఆదిత్యరూపాః స్వాగత మిదంవః పాద్యం ఇదంవః పాద్యం ।

సుపాద్యమితి భోక్తా వదేత్ । ॥సవ్యం॥

శంనోదేవీరితి కర్తాపాద్యోదక మభిమన్త్ర్య॥

శంన్నో దేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే । శంయోరభిస్రవన్తునః ।

కర్తాపవిత్రం కర్ణేనిధాయ ।

చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని ।

తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతిపాప్మాన మరా తింతరేమ ।

లోకస్య ద్వార మర్చిమత్పవిత్రం జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్ ।

అమృతస్య ధారా బహుధా దోహమానం చరణంనో లోకే సుధితాం దధాతు ।

నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయచ ।

జగద్ధితాయ కృష్ణాయ గోవిన్దాయ నమోనమః ।

కర్తాపవిత్రం ధృత్వా । ప్రాచీనావీతీ ।
శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవితో
త్పునాత్వ చ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః ।
కర్తా భోక్తృపాదప్రక్షాళనోదకం శిరసిధృత్వా।
కర్తాద్వయోర్మండల మధ్యే పాత్రం నిక్షిప్య ।
తదుపరి దారువా, పాషాణం వానిధాయ । సవ్యేన ।
కర్తా స్వయంచ పాదౌ ప్రక్షాళ్యాచామేత్ ।

శ్లో॥ మన్డలాత్పురతో దేవాః పితరస్తు తదుత్తరే ।
కర్తాకుర్వీత ఐశాన్యే, కుర్యా దాచమనం విధిః ॥
కర్తా ఆచమ్య భోక్తారా వాచమ్య ।
మం॥ మయియహో మయియశో మయీంద్రియం వీర్యం ॥
ఇతి భోక్తారౌ హృదయమభిమృశ్య, అపఉపస్పృశ్య ।
విష్ణుర్విష్ణుర్విష్ణుః ॥
పురూర వార్ద్రవ సంజ్ఞక విశ్వే దేవాః, భూర్భువస్సువః ।
స్వాహా (ఆస్తాం) అయంవో విష్టరః । సువిష్టరః । అత్రోపవిశన్తు భవన్తః ।
అత్రోపవిశామ । ప్రాచీనావీతీ ॥
అస్మత్పితృ పితామహ ప్రపితా మహాః (మాతృపితామహి ప్రపితామహ్యాః)
భూర్భువస్సువః । స్వధా (ఆస్తాం) అయంవో విష్టరః । సువిష్టరః ।
అత్రోపవిశన్తు భవన్తః । అత్రోపవిశామ । ॥సవ్యం॥
ఓం, ఓం, ఓం, అద్యపూర్వోక్త ....విశిష్టాయాం పుణ్యతిథౌ ప్రాచీనావీతీ ।
అస్మత్పితుః (మాతుః) ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే

భవదనుజ్ఞయా ప్రక్రాన్తం శ్రాద్ధకర్మ కరిష్యే । ।।సవ్యం।। కురుష్వ।। ప్రాచీనావీతీ ।।

మం।। అపహతా అసురా రక్షాగ్ంసి పిశాచా యేక్షయన్తి పృథివీమను ।

అన్యత్రేతో గచ్ఛన్తు యత్రైషాం గతం మనః ।

ఉదీరతా మవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితర స్సోమ్యాసః ।

అసుంయ ఈయురవృకా ఋతజ్ఞాస్తేనోఽవన్తు పితరో హవేషు ।

(ఈ మన్త్రముతో పితృస్థాన భోక్తముందు కూర్చతో నేలమీద మూడుచోట్ల దక్షిణ సమాప్తిగా కొట్టి ఆతడిని ఎడమచేతియం దుంచుకొని నువ్వులు కలిపి తూర్పుమొదలుగా నాలుగు దిక్కులకు చల్లి ఆమూడు చోట్ల అప్రదక్షిణముగా గుండ్రముగా మూడు మన్డలములు చేసి వాటియందు తిలదర్భలుంచవలెను.)

తూష్ణీం ఖాత్వా। వర్తులాకారమన్డల త్రయం కృత్వా ।

తేషు తిలదర్భాన్నిక్షిప్య ।।సవ్యం।।

తూష్ణీం విశ్వే దేవస్థానే యవోదకేనావోక్ష్య ।

తత్ర చతురశ్రమండల ద్వయం కృత్వా ।

యవదర్భాన్నిక్షిప్య ।। (విశ్వేదేవభోక్తముందర దక్షిణభాగములోనూ, ఉత్తరభాగములోనూ, రెండు మన్డలములను ప్రదక్షిణముగా చేసుకొని వాటియందు యవ దర్భలుంచ వలయును)

గాయత్ర్యాఆత్మానం పాకద్రవ్యాణిచ సంప్రోక్ష్య ।

శ్లో।। అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా ।

యస్మరేత్పున్డరీ కాక్షం సబాహ్యాభ్యన్తర శ్శుచిః ।।

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ।

ధియోయోనః ప్రచోదయాత్ ॥

(పై శ్లోక మన్త్రములతో కర్తకూర్చతో, తనమీదనూ భోక్తల మీదనూ, జలము చల్లుకొని పిమ్మట అక్షతోదకము తీసుకొని గాయత్రీమన్త్రముతో వంట మీద ఉదకము మాత్రమే చల్లి భోక్తల వద్దకు వచ్చి ఈ క్రింది వాక్యములు చెప్పి నమస్కరించ వలయును)

శ్రాద్ధార్థం సంపాదితాః పదార్థాః దేశతః కాలతశ్చైవ,
శ్రాద్ధయోగ్యా భవన్త్వితి భవన్తో బృవన్తు ।
శ్రాద్ధయోగ్యా భవన్తు । (అని భోక్తలు చెప్పవలెను.)

శ్లో॥ శ్రాద్ధకాలే గయాం ధ్యాత్వా ధ్యాత్వా దేవం జనార్దనం ।
వస్వాదీంశ్చ పితౄన్ ధ్యాత్వా తత శ్శ్రాద్ధం ప్రవర్తయే ॥ ఇతిధ్యాత్వా ।

## విశ్వేదేవార్చనం

పురూర వార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం ఇదమిదమాసనం ।
సుఖాసనం । హస్తోదకం దత్వా । విశ్వేదేవ దైవేక్షణః క్రియతాం ।
అస్తుక్రియతాం । ఓంతథా । ప్రాప్నువన్తు భవన్తః । ప్రాప్నువామ ।

(విశ్వేదేవ భోక్తకు దర్భలను ఆసనముగా ఇచ్చి హస్తోదకమిచ్చి వాని శిరస్సునందు అక్షితలు చల్లి దర్భలు చేతికీయవలయును)

దర్భేషు అర్ఘ్యపాత్రే ఆసాద్య । ప్రోక్ష్య । ఉత్తానే కృత్వా । పునః ప్రోక్ష్య ।

(విశ్వేదేవభోక్త ముందు చేసిన మండలములపై దక్షిణ, ఉత్తర భాగములలో రెండుదొన్నెలు బోర్లించి కూర్చతో ప్రోక్షించి తిరుగతీసి మరలప్రోక్షించి అక్షతలను చల్లి దొన్నెలలో నీరు దేవతీర్థముగా పోసి)

యవాన్వికీర్య। ఉదకమాపూర్య । శన్నోదేవీరిత్యభిమన్త్ర్య ।

మం॥ శంన్నోదేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే । శంయో రభిస్రవన్తునః ॥

శ్లో॥ యవోసి ధాన్యరాజోవా వారుణో మధు సంయుతః ।
నిర్ణోద స్సర్వ పాపానాం పవిత్రమృషిభిస్స్మృతమ్ ।
అర్ఘ్యపాత్రయోః అమీగంధాః । పుష్పార్థా ఇమే అక్షతాః । అమీకుశాః ।
కూర్చోదకేనైవ అష్టార్ఘ్యై స్సంపూర్ణార్చన మస్తు ।
ఇమాని శ్రీ తులసీ, దర్భ పత్ర తృణానిచ ।

(అర్ఘ్యపాత్రలను అభిమంత్రించి, యవఅక్షతలను, గంధ, పుష్పాక్షతలను చల్లి, కూర్చోదకమును ప్రోక్షించి మారేడు, తులసీ దళములను, దర్భఖండములను వేసి రెండేసి మేడిఆకులను దొప్పలయందు కప్పి పిమ్మట దర్భలను గంధ అక్షతలతో బ్రాహ్మణుని శిరస్సునందుంచి నమస్కరించవలయును.)

ఔదుంబర పర్ణాభ్యాం ప్రచ్ఛాద్య । దర్భైర్వా।
(పురూరవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యో దేవోభ్యో జుష్టం గృహ్ణామి ।
అత్రచ ఆర్ద్రవ సంజ్ఞకేభ్యో విశ్వే భ్యో దేవేభ్యో జుష్టం గృహ్ణామి ।)
వః పాత్రే సంపన్నే సుంసంపన్నే ।
స్వాహార్ఘ్యా స్స్వాహార్ఘ్యాః । సంత్వర్ఘ్యాః

మం॥ ఓం విశ్వే దేవాస ఆగతశ్శృణుతామ ఇమగ్ం హవం ।
ఏదం (య ఇదం) బర్హిర్నిషీదత ।
పురూరవార్ద్రవ సంజ్ఞకాన్ విశ్వాన్ దేవాన్ భవత్సు ఆవాహయిష్యే ।
ఆవాహయ ।

(అని మన్త్రముతో భోక్త శిరమున గంధాక్షతమిశ్రిత దర్భలనుంచి నమస్కరించవలయును.)

ధ్యానం॥మం॥ విశ్వేదేవా శ్శృణుతే మగ్ం హవంమే యేఅన్తరిక్షే య ఉపద్యవిష్ఠ।

యే అగ్నిజిహ్వా ఉతవాయజత్రా ఆసద్యాస్మిన్ బర్హిషి మాదయధ్వం ॥

శ్లో ॥ ఆగచ్ఛన్తు మహాభాగా విశ్వేదేవా మహాబలాః ।

ఏహ్యత్ర విహితా శ్శ్రాద్ధే సావధానా భవన్తుతే ॥

సావధానాస్మః । హస్తోదకం దత్వా । దక్షిణం జాన్వాచ్య ।

హస్తే దర్భం నిధాయ । అర్ఘ్యపాత్రం గృహీత్వా ।

(భోక్తలకు అర్ఘ్యమిచ్చుటకై హస్తోదకమిచ్చి దర్భను చేతియందుంచి దక్షిణ భాగమందుగల అర్ఘ్యపాత్రను తీసుకొని కుడి మోకాలుపై ఉంచుకొని అభిమంత్రించి దేవతీర్థముగా అర్ఘ్యమీయవలయును - రెండవసారి ఉత్తర భాగమునగల పాత్ర)

యా దివ్యా ఆపః పయసా సంబభూవుః ।

యా అన్తరిక్ష ఉతపార్థి వీర్యాః ।

హిరణ్యవర్ణా యజ్ఞియా స్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్వాహా భవన్తు ॥

పురూరవ సంజ్ఞక, విశ్వేదేవాః ఇదం వో అర్ఘ్యం । స్వాహానమః ।

అస్త్వర్ఘ్యం । తత శ్శుద్ధోదకం । పునః హస్తోదకం దత్వా ।

హస్తేదర్భం నిధాయ । అర్ఘ్యపాత్రం గృహీత్వా ।

యా దివ్యా ఆపః పయసా సంబభూవుః ।

యా అన్తరిక్ష ఉతపార్థి వీర్యాః ।

హిరణ్యవర్ణా యజ్ఞియా స్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్వాహా భవన్తు ॥

ఆర్ద్రవ సంజ్ఞక విశ్వేదేవా ఇదంవో అర్ఘ్యం ।

స్వాహా నమః । అస్త్వర్ఘ్యం । తతశ్శుద్ధోదకం ।

పునః హస్తోదకం దత్వా ।

విశ్వేభ్యో దేవేభ్యః పాత్రేస్థానేస్థః । సుస్థానమసి ।

(అని అర్ఘ్యపాత్రలను విశ్వేదేవ భోక్తకు ఎడమప్రక్క కూర్చతో కొట్టి ఆపాత్రలను అచ్చట ఉంచవలయును పిమ్మట అక్షత గంధపుష్ప ధూపదీప వస్త్రములనిచ్చి అర్చించవలయును)

**తతః అర్చనం ।**

మం॥ అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత ।

అర్చన్తు పుత్రకా ఉతపురన్న ధృష్ణ్వర్చత । అర్చత ప్రార్చత ।

ఇత్యక్షతాన్ సమర్ప్య ।

ఓం గంధద్వారాం.......శ్రియం ।

పురూర వార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః । అమీవోగంధాః ।

(గంధమీయవలెను) సుగంధాః ।

ఓం ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః ।

హ్రదాశ్చ పున్డరీ కాణి సముద్రస్య గృహాఇమే ॥

పుష్పార్థా ఇమే అక్షతాః । సుపుష్పాణి । (అని అక్షతలు చల్లవలయును)

మం॥ ఓం ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వతం యోస్మాన్ ।

ధూర్వతి తం ధూర్వయం వయం ధూర్వామః ।

పురూర వార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః అయంవో ధూపః । సుధూపః ।

మం॥ ఉద్దీప్యస్వ జాతవేదో ప్ఘఘ్నం నిర్బుతిం మమ ।

పశూగ్‌శ్చ మహ్యమావహ జీవనంచ దిశోదిశ ।

పురూరవార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః । అయంవోజ్యోతిః । సుజ్యోతిః ।

(అని దీపము చూపించవలయును)

మం॥ యువాసు వాసాః పరివీత ఆగాత్సఉశ్రేయాన్ భవతి జాయమానః ।

తంధీరాసఃకవయ ఉన్నయన్తి స్వాధియో మనసాదేవయన్తః ।

పురూరవార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః అన్తః ప్రావరణార్థం

బహిఃప్రావరణార్థం యోగ్యమిమే వాససీ ।

వస్త్రద్వయం తుభ్యమహం సంప్రదదేనమమ । సువాససీ ।

వః ఆచ్ఛాదనార్థం పవిత్రార్థం అలంకరణార్థం సాక్షతాఇమేకుశాః ।

సుకుశాః । అర్చనం సంపూర్ణం ।

(అస్తు) సంకల్పసిద్ధిరస్త్వితి భవన్తో బృవన్తు । అస్తు సంకల్ప సిద్ధిః ।

యుష్మత్ అనుజ్ఞయా పిత్రాద్యర్చనం కరిష్యే

(మాత్రాద్యర్చనం కరిష్యే) కురుష్వ ॥

ప్రాచీనావీతీ ॥ అస్మత్ పితృ పితామహ ప్రపితా మహానాం గోత్రాణాం....

శర్మణాం (మాతృపితామహి ప్రపితామహీనాం... గోత్రాణాం.... పదాయినాం)

వసురుద్ర ఆదిత్య రుపాణాం ఇదమిద మాసనం ।

సుఖాసనం । హస్తోదకం దత్వా ।

పితుః ప్రతిసాంవత్సరీక మృతాహోఖ్యాన్నశ్రాద్ధేక్షణః క్రియతాం ।

(మాతుః ప్రతిసాంవత్సరీక మృతాహోఖ్యాన్న శ్రాద్ధేక్షణః క్రియతాం) ।

అస్తుక్రియతాం । ఓంతథా । ప్రాప్నువన్తు భవన్తః । ప్రాప్నువామ ।

దర్భేషు అర్ఘ్యపాత్రాణ్యాసాద్య । ప్రోక్ష్య । (దక్షిణ సమాప్తిగా పితృస్థానభోక్త ముందర, అర్ఘ్యపాత్రలనుబోర్లించి ప్రోక్షించి తిరగతీసి, మరలప్రోక్షించి నువ్వులనుంచి నీరు పితృతీర్థముగా నింపి అభిమంత్రించవలయును.)

ఉత్తానాని కృత్వా । పునఃప్రోక్ష్య । తిలాన్వికీర్య । ఉదకమాపూర్య । అభిమన్త్ర్య।

శంన్నో దేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే । శంయో రభిస్రవన్తునః ॥

మం॥ తిలోసి సోమ దేవత్యో గోసవే దేవనిర్మితః ।

ప్రత్నవద్భిః ప్రత్నవస్వధ ఏహి॥

అస్మత్ పితరం...... గోత్రం..... శర్మాణం వసురూపం ఇమాన్ లోకాన్ ప్రీణయాహినః । స్వధానమః । పితామహం...... గోత్రం...... శర్మాణం..... రుద్రరూపం ఇమాన్ లోకాన్ ప్రీణయాహినః । స్వధానమః । ప్రపితామహం...... గోత్రం...... శర్మాణం...... ఆదిత్యరూపం ఇమాన్ లోకాన్ ప్రీణయాహినః । స్వధానమః ।

(అస్మత్ మాతరం..... గోత్రాం....దాం...వసురూపాం ఇమాన్ లోకాన్ ప్రీణయాహినః । స్వధానమః ॥ పితామహీం.... గోత్రాం...దాం......రుద్రరూపాం ఇమాన్ లోకాన్ ప్రీణయాహినః । స్వధానమః ॥ ప్రపితా మహీం.... గోత్రాం పదాం ఆదిత్య రూపాం । ఇమాన్ లోకాన్ ప్రీణయాహినః । స్వధానమః)

(అనగా అర్ఘ్య పాత్రలయందు ఎడమచేతి క్రింద నుండి కుడిచేతి బొటనవేలితో నువ్వులను అద్దవలెను. మూడుసార్లు ఇలాచేసి ఆ పాత్రలందు గంధ, తిల, దర్భ, భృంగరాజ, బిల్వ, మేడి పత్రములనుంచవలెను)

అర్ఘ్య పాత్రే ష్వమీగంధాః । పుష్పార్ధా ఇమేతిలాః । అమీకుశాః ।

కూర్చోదకేనైవ అష్టార్ఘ్యై స్సంపూర్ణార్చనమస్తు ।

ఇమాని శ్రీ భృంగరాజ, దర్భపత్రతృణానిచ ।

ఔదుంబర పర్ణైః ప్రచ్ఛాద్య । దర్భైర్వా ।

(అస్మత్ పిత్రేతే జుష్టం గృహ్ణామి । పితామహాయతే జుష్టం గృహ్ణామి ।

ప్ర పితామహాయతే జుష్టం గృహ్ణామి । అస్మత్ మాత్రే తేజుష్టం గృహ్ణామి ।

పితామహ్యైతే జుష్టం గృహ్ణామి । ప్రపితామహ్యైతే జుష్టం గృహ్ణామి ।)

వః పాత్రాణి సంపన్నాని । సుసంపన్నాని ।

స్వధార్ఘ్యా స్స్వధార్ఘ్యా స్సంత్వర్ఘ్యాః ।

ఓం ఉశం తస్త్వా హవామహ ఉశన్త స్సమిధీ మహి ।

ఉశన్న్ శత ఆవహ పితృ్యాన్ హవిషే అత్తవే ।

అస్మత్ పితృ పితామహ ప్రపితామహాన్ ..... గోత్రాన్.... శర్మణః వసురుద్ర ఆదిత్య రూపాన్ భవత్సు ఆవాహయిష్యే

(అస్మత్ మాతృ, పితామహి, ప్రపితామహీః । ....గోత్రాః .... పదాః వసురుద్ర ఆదిత్య రూపాః భవత్సు ఆవాహయిష్యే)

ఆవాహయ ॥సవ్యం॥ నమస్కృత్య ।

(భోక్త పదునేడు మార్లు ఓంకారమును జపించవలయును. కర్త పై మన్త్రముతో భోక్త శిరమున గంధము, తిలలు అద్దిన దర్భలను ఉంచి సవ్యముగా ఈక్రింది మన్త్రముతో నమస్కరించి ప్రాచీనావీతి చేసుకోవలెను.)

ఓం ఆయన్తునః పితర స్సోమ్యా సోగ్ని ష్వాత్తాః పథిభి ర్దేవయానైః ।

అస్మిన్ యజ్ఞే స్వధయా మదం త్వధి బృవన్తు తే అవం త్వస్మాన్ ।

సావధానా భవన్తు తే । సావధానాస్మః ॥

ప్రాచీనావీతీ ॥ హస్తోదకం దత్వా ॥ హస్తేదర్భం నిధాయ । (పితృస్థానములోని

మొదటి దొప్పను తీసుకొని ఎడమ మోకాలు క్రింద అన్చి కుడిమోకాలు పై దొప్పనుంచి యా దివ్యా అను మన్త్రముతో అభిమంత్రించి పితృతీర్థముగా బ్రాహ్మణహస్తమందు అర్ఘ్యమీయవలయును. కర్తలు ఇద్దరుకానీ ఎక్కువమందికానీ ఉంటే వారిచేతులమీదుగా నీయవచ్చు. జ్యేష్ఠుని చేతి మీదినుండి వెంటనే బ్రాహ్మణ హస్తము నందుపడవలయును. దీనినే జ్యేష్ఠ పూర్వక న్యాయమందురు.)

సవ్యం జాన్వా చ్య । యాదివ్యాఽ ఆపః పయసా సంబ భూవుః ।
యా అన్తరిక్ష ఉతపార్థి వీర్యాః ।
హిరణ్య వర్ణా యజ్ఞి యాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్వధా భవన్తు ॥
పితః...గోత్ర.....శర్మన్...వసురూప ఇదంతే అర్ఘ్యం స్వధానమః ।
అస్త్వర్ఘ్యం । తతశ్శుద్ధోదకం । పునః హస్తోదకం దత్వా ।
హస్తే దర్భం నిధాయ ।
ఓం యాదివ్యా .....స్వధా భవన్తు ।
పితామహ... గోత్ర... శర్మన్ రుద్రరూప ఇదంతే అర్ఘ్యం స్వధానమః ।
అస్త్వర్ఘ్యం । తత శ్శుద్ధోదకం । పునఃహస్తోదకం దత్వా ।
హస్తే దర్భం నిధాయ ।
యా దివ్యా ఆపఃప యసాసంబభూవుః । యాఅన్తరిక్ష ఉతపార్థివీర్యాః ।
హిరణ్యవర్ణా యజ్ఞియా స్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్వధాభవన్తు ॥
ప్రపితామహ...గోత్ర....శర్మన్...
ఆదిత్య రూప ఇదంతే అర్ఘ్యం స్వధానమః ।
అస్త్వర్ఘ్యం । తత శ్శుద్ధోదకం । పునః హస్తోదకం దత్వా ।
పితృ పితామహ ప్రపితామహేభ్యః పాత్రాణి స్థానానిస్థ । సుస్థానమసి ।

(యా దివ్యా ఆపః పయసాసంబభూవుః । యాఅన్తరిక్ష ఉతపార్థివీర్యాః ।
హిరణ్యవర్ణా యజ్ఞియా స్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్వధాభవన్తు ॥
మాతః గోత్రే పదే వసురూపే ఇదం తే అర్ఘ్యం స్వధానమః । అస్త్వర్ఘ్యం ।
తత శ్శుద్ధోదకం । పునః హస్తోదకం దత్వా । హస్తే దర్భం నిధాయ ।
ఓం యాదివ్యా.....స్వధాభవన్తు ।
పితామహి.... గోత్రే ... పదే... రుద్రరూపే
ఇదం తే అర్ఘ్యం స్వధానమః । అస్త్వర్ఘ్యం । తతశ్శుద్ధోదకం ।
పునః హస్తోదకం దత్వా । హస్తే దర్భం నిధాయ ।
యాదివ్యా....... భవన్తు ॥
ప్రపితామహి ....గోత్రే .... పదే .... ఆదిత్యరూపే
ఇదం తే అర్ఘ్యం స్వధానమః ।
అస్త్వర్ఘ్యం । తతశ్శుద్ధోదకం । పునః హస్తోదకం దత్వా ।
మాతృపితామహి ప్రపితామహీభ్యః పాత్రాణిస్థానానిస్థ । సుస్థానమసి ।)

**తతః అర్చనం ॥**

అర్చత ప్రార్చత ప్రియ మేధాసో అర్చత ।
అర్చన్తు పుత్రకా ఉతపురన్న ధృష్ణ్వర్చత । అర్చత ప్రార్చత ।
పితృస్థాన బ్రాహ్మణస్య శిరః ప్రభృతి పాదపర్యన్తం తిలైః అర్చయేత్ ।
గంధద్వారాం.....శ్రియం ॥సవ్యం॥
పితృపితామహ ప్రపితామహాః
(మాతృపితామహి ప్రపితామహ్యః) అమీవోగంధాః ।సుగంధాః ।
ఆయనేతే పరాయణే దూర్వా రోహన్తు పుష్పిణీః

హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥
పుష్పార్థా ఇమేతిలాః । సుపుష్పాణి ।
ఓం ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వతం యోస్మాన్ ।
ధూర్వతితం ధూర్వయం వయం ధూర్వామః ।
పితృపితామహ ప్రపితామహాః
(మాతృపితామహి ప్రపితామహ్యాః) అయంవో ధూపః । సుధూపః ।

ఉద్దీప్యస్వ జాతవేదో పఘ్నం నిర్ఋతిం మమ ।
పశూగ్శ్చ మహ్యా మావహ జీవనంచ దిశోదిశ ॥

పితృపితామహ ప్రపితామహాః । (మాతృ పితామహి ప్రపితామహ్యాః)
అయంవో జ్యోతిః । సుజ్యోతిః ।
ఓం యువాసువాసాః పరివీత ఆగాత్స ఉశ్రేయాన్ భవతి జాయమానః ।
తం ధీరాసః కవయ ఉన్నయన్తి స్వాధియో మనసా దేవయన్తః ।
పితృపితామహ ప్రపితా మహాః..... గోత్రాః....శర్మాణః ।
వసురుద్ర ఆదిత్య రూపాః ।
(మాతృ పితామహి ప్రపితామహ్యాః.....గోత్రాః...
పదాః వసురుద్ర ఆదిత్య రూపాః) ॥ సవ్యం॥

అన్తః ప్రావరణార్థం బహిఃప్రావరణార్థం యోగ్యమిమే వాససీ ।
వస్త్రద్వయం తుభ్యమహం సంప్రదదేన మమ । సువాససీ ।
ప్రాచీనావీతీ । వః ఆచ్ఛాదనార్థం । పవిత్రార్థం । అలంకరణార్థం ।
సతిలా ఇమేకుశాః సుకుశాః ।

అర్చనం సంపూర్ణం । సంకల్ప సిద్ధిరస్త్వితి భవన్తో బ్రువన్తు । అస్తుసంకల్పసిద్ధిః ।

యుష్మదనుజ్ఞయా సర్వత్ర మన్డలోద్వర్తన పాత్రాసాదనంచ కరిష్యే ।

సవ్యం । కురుష్వ ।

శ్లో॥ కురుక్షేత్రం గయాం గంగాం ప్రభాసం పుష్కరాణిచ ।

ఏతాని మనసా ధ్యాత్వా శ్రాద్ధకాలే సదాపఠేత్ ॥

విష్ణుర్విష్ణుర్విష్ణుః

## అథఅగ్నౌకరణం

ఓం, ఓం, ఓం, అద్యపూర్వోక్త...... పుణ్యతిథౌ ॥

ప్రాచీనావీతీ॥ పితుః (మాతుః) ప్రతిసాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే భవదనుజ్ఞయా ఔపాసనాగ్నావేవ (లౌకికాగ్నావేవ) అగ్నౌకరణం కరిష్యే ॥

సవ్యం ॥ కురుష్వ ॥

అన్నమగ్నావధిశ్రిత్య । దక్షిణత ఉద్వాస్య । అద్భిః ప్రోక్ష్య । అభిఘార్య ।

అన్నం ద్వాభ్యాం దర్భాభ్యాం చతుర్ధా విభజ్య । ఐశాన్యభాగే అభిఘార్య ।

ప్రాచీనావీతీ । తూష్ణీం అగ్నిం అప్రదక్షిణం పరిషిచ్య ।

మేక్షణ ఉపస్తీర్య । తేనావదాయ ।

అర్ధభాగం గృహీత్వా । అభిఘార్య । హవిఃప్రత్యభి ఘారయతి ।

ఓంసోమాయ పితృపీతాయ స్వధానమః । అర్ధం జుహోతి ।

సోమాయ పితృపీతా యేదం నమమ ।

శిష్టం పాత్రాన్తరే నిధాయ । పునః మేక్షణ ఉపస్తీర్య ।

తేనావదాయ । సర్వం గృహీత్వా । అభిఘార్య ।

ఓం యమాయాంగిరస్వతే పితృమతే స్వధానమః । అర్థం జుహోతి ।

యమాయాంగిరస్వతే పితృమత ఇదంనమమ ।

హోమ శిష్టద్వయం అనుపస్తరణేన అనభిఘారణేన । సర్వం జుహోతి ।

మేక్షణే సర్వం గృహీత్వా । సర్వం జుహోతి ।

ఓం అగ్నయే కవ్యవాహనాయ స్వధానమః ।

అగ్నయే కవ్యవాహనాయ ఇదం నమమ ।

తూష్ణీం మేక్షణ మగ్నౌ ప్రహరతి ।

తూష్ణీం అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య । సవ్యం ।

చతుస్సాగర పర్యన్తం.... అభివాదయే ।

(పైహోమములు సవ్యముగా చేయుట ఒక సాంప్రదాయము)

(అగ్నౌకరణ నిమిత్తము విస్తరియందు అభిఘరించి, అన్నము ఉంచుకొని, అభిఘరించి ఆ పాత్రను, అగ్నిపై వేడిసెగ చూపించి, అగ్నికి దక్షిణ భాగమున ఉంచి కూర్చతో అగ్నికి అప్రదక్షిణముగా పరిషేచన చేసి కూర్చతో ఉదకము ప్రోక్షించి మరల అభిఘరించి రెండు దర్భలతో అన్నముపై + గుర్తుచేసి విడివిడిగా నాలుగుభాగములు చేసి అన్దలి ఈశాన్యభాగములోని అన్నమును (కొందరు ఆగ్నేయభాగమును హోమం చేయుదురు) సగం తీసుకొని దానిలో సగం అన్నం అగ్నిలో ప్రథమాహుతిగావేసి, మిగిలిన అన్నమును విస్తరిలో ఒక పక్కగాపెట్టి మరల ఈశాన్యభాగమందు అభిఘరించి మొత్తం అన్నంతీసికొని వెనుకటి వలె సగమే హోమము చేసి ఇంతకుముందు పక్కనబెట్టిన అన్నము, ఈ సగ అన్నము కలిపి అభిఘరించకయే హోమము చేయవలయును. పిమ్మట అగ్నిని అప్రదక్షిణముగా కూర్చతో పరిషేచనము చేసి సవ్యము చేసుకొని ప్రవర చెప్పవలెను.)

ప్రాచీనావీతీ ॥ పితృస్థానే హస్తోదకందత్వా । పాత్రయో రుపస్తీర్య ।
ఆగ్నేయ భాగమన్నమాదాయ స్వధేయమితి త్రివారం పితృపాత్రే నిక్షిప్య ।
స్వధేయం, స్వధేయం, స్వధేయం । అస్తుస్వధా అస్తుస్వధా । అస్తుస్వధా ।
ఇతిభోక్తావదేత్ । అభిఘార్య । పునః హస్తోదకం దత్వా ।
(ఆస్వధేతి కర్తా తదన్న మభిమన్త్ర్య । ఆస్వధేత్యా శ్రావయతి ।
అస్తుస్వధేతి ప్రత్యాశ్రావయతి। స్వధానమ ఇతివషట్కరోతి ।
స్వధాకారోహి పితృణామ్ ।) ॥సవ్యం॥
విశ్వేదేవస్థానే హస్తోదకం దత్వా । పాత్రయో రుపస్తీర్య ।
చరుపాత్రే అభిఘార్య । ఓం, ఓం, ఓం,....... పుణ్యాతి థౌ ప్రాచీనావీతీ ।
పితుః (మాతుః) ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే,
అన్నశుద్ధ్యర్థం అన్నస్య ఆఘ్రాణదోష నిర్హరణార్థం ।
అన్నసూక్త పఠనం కారయిష్యే ॥సవ్యం॥
బ్రాహ్మణైస్సహ ఆశ్రావయిష్యే । ఆశ్రావయ ॥
ఓం నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః ।
నమోవాచే నమో వాచస్పత యేనమో విష్ణవే బృహతే కరోమి ॥
ఓం సహవైదేవానాం.....తదప్యేషశ్లోకో భవతి ।

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ।

## పరివేషణ విధిః

శ్లో॥ అన్నంచ పాయసం భక్ష్యం, ఘృతంచ వ్యంజనాదికం ।
సూపమన్తే ప్రదాతవ్యం సర్వంస్యాద్దైవ పూర్వకం ॥
అన్నే పాయసే ఘృత పాత్రేచాభిఘార్య ।

గాయత్ర్యా అద్భిః అవోక్ష్య ।
ఓం భూర్భువస్సువః.... ప్రచోదయాత్ ।
విశ్వేదేవస్థానే హస్తోదకం దత్వా । దేవసవితః ప్రసువ ।
దక్షిణం జాన్వాచ్య ।
పృథివీతే పాత్రం ద్యౌరపి ధానం బ్రహ్మణస్త్వాముఖే జుహోమి
బ్రాహ్మణానాంత్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షిత మసి
మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్లోకే ।
ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదం । సమూఢమస్య పాగ్ం సురే ॥
స్వాహా శ్రీవిష్ణోహవ్యం రక్షస్వ । పురూరవార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవాః ।
ఏతద్వో హవ్యం సపరికరం । పురూర వార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవా
దేవతేదమన్నం హవ్యం బ్రాహ్మణస్త్వావహా నీయార్థే,
దత్తం దాస్యమానం చాఽతృప్తేస్త త్సర్వం గయేయం భూర్గదా ధరో భోక్తా।
అన్నం బ్రహ్మ, అహంచ బ్రహ్మ, భోక్తాచ బ్రహ్మ ।
కల్పిత సౌవర్ణం పాత్రం అక్షయ్య వటచ్ఛాయేయం ।
పురూరవార్ద్రవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యో దేవేభ్యః ।
ఇదమిదమన్నం అమృత స్వరూపం ।
ఆతృప్తేర్దాస్యమానం హవ్యం తత్సత్ స్వాహా నమమ,
నమమ గయాయాం శ్రీవిష్ణుపాదాది సమస్తతీర్థేషు,
గంగోదకేషు దత్తమస్త్వితి భవన్తో బృవన్తు । గయాయాం దత్తమస్తు ।
పానీయార్థం ఉదకుంభం తుభ్యమహం సంప్రదదేనమమ ।
(గాయత్రీ మన్త్రముతో భోక్తల విస్తళ్ళమీద కూర్చతో జలము ప్రోక్షించి

విశ్వేదేవ భోక్తకు హస్తోదకమిచ్చి ఆ విస్తరిచుట్టూ ప్రదక్షిణముగా కూర్చునుతిప్పి భోక్త ఎడమచేతి మధ్యవేలితో విస్తరిపట్టుకొని ఉండగా, కర్త తన వైపున ఎడమచేయి క్రింద, పైన కుడిచేయి పెట్టి రెండుహస్తముల మధ్య విస్తరిని ఉంచుకొని, అన్నంబ్రహ్మా, అనునప్పుడు, కర్త ఎడమచేతితో విస్తరిని, కుడిచేతితో బ్రాహ్మణ హస్తమును పట్టుకొని అన్నమువైపు, తనవైపు, భోక్తవైపు, చూపించుచూ అన్నమునందు, భోక్త యొక్క కుడిచేతి బొటనవేలు ముంచి నేతిదొన్నెయందు చూపించి వదిలి, అక్షతోదకమును విశ్వేదేవుల ఎడమప్రక్కన వదిలి నమస్కరించవలెను. పితృస్థానమునందునూ ఇదే క్రియ విశేషమేమనగా ఎడమచేయిపైకి కుడిచేయి క్రిందకు ఉంచుట, అన్నము నందు తిలోదకమును పితృభోక్త కుడివైపున వదులుటయే)

ఓం యేదేవా దివ్యేకాదశస్థ పృథివ్యా మధ్యేకా దశస్థాప్సుషదో మహినైకాదశస్థ తేదేవా యజ్ఞమిమం జుషధ్వం ॥ ఇతి నమస్కృత్య

ప్రాచీనావీతీ ॥ హస్తోదకందత్వా ॥ దేవ సవితః ప్రసువ ।

అప్రదక్షిణం పరిషిచ్య ।సవ్యంజాన్వాచ్య ।

ఓం పృథివీతే పాత్రం ద్యౌరపి ధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి

బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షిత

మసి మైషాంక్షేష్ఠా అముత్రాముష్మిన్లోకే ॥

ఓం,ఇదం విష్ణుర్విచక్రమే...... సురే॥

స్వధా శ్రీవిష్ణోకవ్యం రక్షస్వ । అస్మత్ పితృపితామహ ప్రపితామహాః... గోత్రాః..... శర్మాణః (మాతృ పితామహి ప్రపితామహ్యాః......గోత్రాః.....పదాః) వసురుద్ర ఆదిత్యారూపాః ।

ఏతద్వః కవ్యం సపరికరం ॥ పితృ పితామహ ప్రపితామహాః ।

(మాతృపితామహి ప్రపితామహ్యాః) రూపా దేవా దేవతేద మన్నం కవ్యం,
బ్రాహ్మణస్త్వావహనీయార్థే దత్తం దాస్యమానంచ ఆతృప్తేస్తత్సర్వం గయేయం
భూర్గదాధరో భోక్తా । అన్నంబ్రహ్మ ।అహంచబ్రహ్మ ।భోక్తాచబ్రహ్మ ।
కల్పితరాజతం పాత్రం అక్షయ్యవటచ్ఛాయేయం ॥

అస్మత్ పితృ పితామహ ప్రపితామహేభ్యః ... గోత్రేభ్యః...శర్మభ్యః వసురుద్రాదిత్య రూపేభ్యః (మాతృ పితామహి ప్రపితామహీభ్యః గోత్రాభ్యః ...పదాభ్యః)

వసురుద్ర ఆదిత్య రూపాభ్యః ఇదమిదమన్నం అమృతస్వరూపం,
ఆతృప్తేర్దాస్యమానం కవ్యం తత్సత్ స్వధా స్వధా నమమ. నమమ,
గయాయాం శ్రీవిష్ణుపాదాది సమస్త తీర్థేషు గంగోదకేషు
దత్తమస్త్వితి భవన్తో బృవన్తు । గయాయాం దత్త మస్తు ।
పానీయార్థం ఉదకుంభం, తుభ్యమహం ... నమమ ॥
సవ్యం । నమస్కృత్య ।
యేచేహ పితరో యేచనేహ యాగ్ంశ్చ విద్మయాగ్ం ఉచన ప్రవిద్మ ।
అగ్నేత్వం వేత్థ యదితే జాతవేద స్వధాభిర్యజ్ఞగ్ం సుకృతం జుషస్వ ।
ఓం, ఓం, ఓం, స్వర, వర్ణ, మన్త్ర తన్త్ర లోపప్రాయశ్చిత్తార్థం,
యధాశక్తి గాయత్రీ మహా మన్త్ర జపం కరిష్యే ॥
కర్తా దశవారం గాయత్రీం జప్త్వా ।

శ్లో ॥ సప్త వ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజనేగిరౌ ।
చక్రవాకా శ్శరద్వీపే, హంసా స్సరసి మానసే ॥

యేస్మజాతాః కురుక్షేత్రే బ్రాహ్మణావేద పారగాః ।

దేవవీతిం దధానాః । అహోరాత్రే హవిషా వర్ధయన్తః । అతి పాప్మానమతి ముక్త్యాగమేమ।
ప్రత్యువదృశ్యాయతీ । వ్యుచ్ఛన్తీ దుహితా దివః । అపో మహీ వృణు తే చక్షుషా ।
తమో జ్యోతిష్కృణోతి సూనరీ । ఉదుస్రియాస్సచతే సూర్యః । సచా ఉద్యన్నక్షత్రమర్చిమత్।
తవేదుషో వ్యుషి సూర్యస్య చ । సం భక్తేన గమేమహి । తన్నో నక్షత్రమర్చిమత్ ।
భానుమత్తేజ ఉచ్చరత్ । ఉపయజ్ఞమిహాగమత్ । ప్ర నక్షత్రాయ దేవాయ । ఇన్ద్రాయేన్దుగ్ం
హవామహే । స నస్సవితా సువథ్సనిమ్ । పుష్టిదాం వీరవ త్తమమ్ । ఉదుత్యం
జాతవేదసం దేవం వహన్తి కేతవః । దృశే విశ్వాయ సూర్యమ్ । (సం. ౧-౪-౪౩)
చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః । ఆప్రా ద్యావాపృథివీ
అన్తరిక్షగ్ం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ । (సం. ౧-౪-౪౩) అదితిర్న
ఉరుష్యత్వదితిశ్శర్మ యచ్ఛతు । అదితిః పాత్వగ్ంహసః॥ (సం. ౧-౫-౧౧)
మహీమూషు మాతరగ్ం సువ్రతానామృతస్య పత్నీ మవసే హువేమ । తువిక్షత్రామజరన్తీ
మురూచీగ్ం సుశర్మాణమదితిగ్ం సుప్రణీతిమ్ । (సం. ౧-౫-౧౧) ఇదం
విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ । సమూఢమస్య పాగ్ంసురే ।
(సం.౧-౨-౧౩) ప్ర తద్విష్ణుస్స్తవతే వీర్యాయ । మృగో నభీమః కుచరో గిరిష్ఠాః ।
యస్యోరుషు త్రిషు విక్రమణేషు । అధి క్షియన్తి భువనానివిశ్వా । (బ్రా. ౨-౪-౩)
అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయమ్ । అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి ।
(సం. ౪-౪-౪) భువో యజ్ఞస్య రజసశ్చ నేతా యత్రా నియుద్భిస్సచసే శివాభిః ।
దివి మూర్ధానం దధిషే సువర్ షాం జిహ్వామగ్నే చకృషే హవ్య వాహమ్ ।
(సం.౪-౪-౪) అను నోఽద్యానుమతిర్యజ్ఞం దేవేషు మన్యతామ్ । అగ్నిశ్చ

హవ్యవాహన్నో భవతాం దాశుషే మయః । అన్విదను మతే త్వం మన్యాసై శంచనః కృధి । క్రత్వే దక్షాయ నో హినుప్రణ ఆయూగ్ంషి తారిషః । (సం.౩-౩-౧౧) హవ్యవాహమభిమాతిషాహమ్ । రక్షోహణం పృతనాసు జిష్ణుమ్ । జ్యోతిష్మన్తం దీద్యతం పురన్ధిమ్ । అగ్నిగ్గ్ం స్విష్టకృతమా హువేమ । (బ్రా.౨-౪-౧) స్విష్టమగ్నే అభి తత్పృణాహి । విశ్వా దేవపృతనా అభిష్య । ఉరుంనః పన్థాం ప్రదిశన్వి భాహి । జ్యోతిష్మద్ధేహ్యజరం న ఆయుః ॥ (బ్రా.౨-౪-౧)[1]

అగ్నయే స్వాహా కృత్తికాభ్యస్స్వాహా । అమ్బాయైస్వాహా దులాయై స్వాహా । నితత్న్యై స్వాహాఽభ్రయన్త్యై స్వాహా । మేఘయన్త్యై స్వాహా వర్షయన్త్యై స్వాహా । చుపుణీకాయై స్వాహా । ప్రజాపతయే స్వాహా రోహిణ్యై స్వాహా । రోచమానాయై స్వాహా ప్రజాభ్యస్స్వాహా ॥ సోమాయ స్వాహా మృగశీర్‌షాయ స్వాహా । ఇన్వకాభ్యస్స్వాహౌషధీభ్యస్స్వాహా । రాజ్యాయ స్వాహాఽభిజిత్యై స్వాహా ॥ రుద్రాయ స్వాహాఽఽర్ద్రాయై స్వాహా । పిన్వమానాయై స్వాహా పశుభ్యస్స్వాహా ॥ అదిత్యై స్వాహా పునర్వసుభ్యాం । స్వాహాఽఽభూత్యై స్వాహా ప్రజాత్యై స్వాహా॥ బృహస్పత యే స్వాహా తిష్యాయ స్వాహా । బ్రహ్మవర్చసాయ స్వాహా ॥ సర్పేభ్యస్స్వాహాఽఽశ్రేషాభ్యస్స్వాహా। దన్దశూకేభ్యస్స్వాహా ॥ పితృభ్య స్స్వాహా మఘాభ్యః । స్వాహాఽనఘాభ్యస్స్వాహాఽ గదాభ్యః । స్వాహాఽరున్ధతీభ్యస్స్వాహా ॥ అర్యమ్ణేస్వాహా ఫల్గునీభ్యాగ్ం స్వాహా । పశుభ్యస్స్వాహా । భగాయ స్వాహా ఫల్గునీభ్యాగ్ స్వాహా । శ్రైష్ఠ్యాయస్వాహా ॥ సవిత్రే స్వాహా హస్తాయ । స్వాహా దదతే స్వాహా పృణతే ।

1. బ్రా.౩-౧-౩

స్వాహా ప్రయచ్ఛతే స్వాహా ప్రతిగృహ్ణతే స్వాహా ॥ త్వష్ట్రే స్వాహా చిత్రాయై స్వాహా । చైత్రాయ స్వాహా ప్రజాయై స్వాహా ॥ వాయవే స్వాహా నిష్ట్యాయై స్వాహా । కామచారాయ స్వాహాఽభిజిత్యై స్వాహా ॥ ఇన్ద్రాగ్నిభ్యాగ్ం స్వాహా విశాఖాభ్యాగ్ం స్వాహా। శ్రైష్ఠ్యాయ స్వాహాఽభిజిత్యై స్వాహా ॥ పౌర్ణమాస్యై స్వాహా కామాయ స్వాహాఽఽగత్యై స్వాహా ॥[1]

మిత్రాయ స్వాహాఽనూరాధేభ్యస్స్వాహా । మిత్రధేయాయ స్వాహాఽభిజిత్యై స్వాహా ॥ ఇన్ద్రాయ స్వాహా జ్యేష్ఠాయై స్వాహా । జ్యైష్ఠ్యాయ స్వాహాఽభిజిత్యై స్వాహా ॥ ప్రజాపతయే స్వాహా మూలాయ స్వాహా । ప్రజాయై స్వాహా ॥ అద్భ్యస్స్వాహాఽషాఢాభ్యస్స్వాహా । సముద్రాయ స్వాహా కామాయ స్వాహా । అభిజిత్యై స్వాహా । విశ్వేభ్యో దేవేభ్య స్వాహాఽషాఢాభ్యస్స్వాహా । అనపజయ్యాయ స్వాహాఽజిత్యై స్వాహా । బ్రహ్మణే స్వాహాఽభిజితే స్వాహా ॥ బ్రహ్మలోకాయస్వాహాఽభిజిత్యైస్వాహా ॥ విష్ణవేస్వాహాశ్రోణాయై స్వాహా । శ్లోకాయ స్వాహా శ్రుతాయ స్వాహా ॥ వసుభ్యస్స్వాహా శ్రవిష్ఠాభ్యస్స్వాహా । అగ్రాయస్వాహా పరీత్యై స్వాహా ॥ వరుణాయ స్వాహా శతభిషజే స్వాహా । భేషజేభ్యస్స్వాహా॥ అజాయైకపదే స్వాహా ప్రోష్ఠపదేభ్యస్స్వాహా । తేజసేస్వాహా బ్రహ్మవర్చసాయ స్వాహా ॥ అహయే బుధ్నియాయ స్వాహా ప్రోష్ఠపదేభ్యస్స్వాహా ॥ ప్రతిష్ఠాయై స్వాహా । పూష్ణే స్వాహా రేవత్యై స్వాహా । పశుభ్యస్స్వాహా ॥ అశ్విభ్యాగ్ం స్వాహాఽశ్వయుగ్భ్యాగ్ం స్వాహా । శ్రోత్రాయ స్వాహా శ్రుత్యైస్వాహా ॥ యమాయ స్వాహాఽపభరణీభ్యస్స్వాహా । రాజ్యాయ స్వాహాఽభిజిత్యై స్వాహా ॥ అమావాస్యాయై

1.బ్రా. ౩-౧-౪

స్వాహా కామాయ స్వాహాఽఽగత్యైస్వాహా ॥[1]

చన్ద్రమసే స్వాహా ప్రతీదృశ్యాయై స్వాహా । అహోరాత్రేభ్యస్స్వాహాఽర్ధమాసేభ్యస్స్వాహా । మాసేభ్యస్స్వాహర్తుభ్యస్స్వాహా । సంవత్సరాయ స్వాహా ॥ అహ్నే స్వాహా రాత్రియై స్వాహా । అతిముక్త్యై స్వాహా ॥ ఉషసే స్వాహా వ్యుష్ట్యైస్వాహా । వ్యూషుష్యైస్వాహా వ్యుచ్ఛన్త్యైస్వాహా । వ్యుష్టాయై స్వాహా ॥ నక్షత్రాయ స్వాహోదేష్యతే స్వాహా । ఉద్యతే స్వాహోదితాయ స్వాహా । హరసే స్వాహా భరసే స్వాహా । భ్రాజసే స్వాహా తేజసే స్వాహా । తపసే స్వాహా బ్రహ్మవర్చసాయ స్వాహా ॥ సూర్యాయ స్వాహా నక్షత్రేభ్యస్స్వాహా । ప్రతిష్ఠాయై స్వాహా ॥ అదిత్యై స్వాహా ప్రతిష్ఠాయైస్వాహా । విష్ణవేస్వాహా యజ్ఞాయ స్వాహా । ప్రతిష్ఠాయై స్వాహా ॥[2]

దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః । సురభి నోముఖా కరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్ [3]॥ ఆపో హి ష్ఠామయోభువస్తా న ఊర్జేదధాతన । మహే రణాయ చక్షసే । యో వశ్శివతమో రసస్తస్య భాజయతేహనః । ఉశతీరివ మాతరః। తస్మా అరం గమామ వో యస్యక్షయాయ జిన్వథ । ఆపో జనయథా చనః[4]॥ ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం విమధ్యమగ్గ్ం శ్రథాయ । అథా వయమాదిత్య వ్రతేతవానాగసో అదితయేస్యామ। అస్తభ్నాద్ద్యామృషభో అన్తరిక్షమమిమీత వరిమాణం పృథివ్యా ఆసీదద్విశ్వా భువనాని సమ్రాడ్విశ్వేత్తాని వరుణస్యవ్రతాని [5] ॥ (అత్ర బోధాయనవేఙ్క టేశీయప్రయోగమాలాయాం యచ్చిద్ధితే ఇత్యస్య మన్త్రస్య జపోఽభిహితః) యచ్చిద్ధి తే విశో యథా ప్ర దేవ వరుణ వ్రతమ్। మినీమసి

1.బ్రా. ౩-౧-౫ 2.బ్రా.౩-౧-౬ 3.సం.౧-౫-౧౧ 4.సం.౫-౬-౧ 5.సం.౧-౨-౮

ద్యవిద్యవి ॥ యత్కిం చేదం వరుణ దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్చరామసి । అచిత్తీ యత్తవధర్మా యుయోపిమ మానస్తస్మాదేనసో దేవ రీరిషః ॥ కితవాసో యద్రిరిపునర్న దీవి యద్వా ఘా సత్యముత యన్న విద్మ । సర్వా తా విష్య శిథిరేఽవ దేవాథా తే స్యామ వరుణ ప్రియాసః ॥[1] అవ తేహేడో వరుణ నమోభిరవ యజ్ఞేభిరీమహే హవిర్భిః । క్షయన్న స్మభ్యమసుర ప్రచేతోరాజన్నేనాగ్ంసి, శిశ్రథః కృతాని ॥[2]

తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదా శాస్తే యజమానో హవిర్భిః । అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ం స మాన ఆయుః ప్రమోషీః ॥[3]

హిరణ్యవర్ణాశ్శుచయః పావకా యాసుజాతః కశ్యపో యాస్విన్ద్రః । అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తాన ఆపశ్శగ్గ్ం స్యోనా భవన్తు । యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యఞ్జనానామ్ । మధుశ్చుతశ్శుచయోయాః పావకాస్తాన ఆపశ్శగ్గ్ం స్యోనా భవన్తు । యాసాం దేవా దివి కృణ్వన్తి భక్షం యా అన్తరిక్షే బహుధా భవన్తి । యాః పృథివీం పయసోన్దన్తిశుక్రాస్తా న ఆపశ్శగ్గ్ం స్యోనా భవన్తు । శివేన మా చక్షుషా పశ్యతాపశ్శివయా తనువోపస్పృశత త్వచంమే । సర్వాగ్ం అగ్నీగ్ంరప్సుషదో హువేవో మయి వర్చో బలమోజో నిధత్త । యదదస్సం ప్రయతీరహావనదతాహతే । తస్మాదా నద్యోనామస్థతా వో నామాని సిన్ధవః । యత్ప్రేషితా వరుణేన తాశ్శీభగ్ం సమవల్గత । తదాప్నోదిన్ద్రోవో యతీస్తస్మాదాపో అనుస్థన । అపకామగ్గ్ం స్యన్దమానా అవీవరత వో హికమ్ । ఇన్ద్రో వశ్శక్తిభిర్దేవీ స్తస్మాద్వార్ణామ

1.సం.౩-౪-౧౧ 2.సం.౨-౧-౧౧ 3.సం.౨-౧-౧౧

వో హితమ్ । ఏకో దేవో అప్యతిష్ఠ ధ్యన్దమానా యథావశమ్ । ఉదానిషుర్మహీరితి తస్మాదుదకముచ్యతే। ఆపో భద్రా ఘృతమిదాప ఆసురగ్నీషోమౌ బిభ్రత్యాప ఇత్తాః। తీవ్రో రసో మధుపృచామరంగమఆ మా ప్రాణేన సహవర్చసా గన్ । ఆదిత్పశ్యామ్యుత వా శృణోమ్యా మా ఘోషోగచ్ఛతివాఙ్న ఆసామ్ । మన్యే భేజానో అమృతస్య తర్ హి హిరణ్యవర్ణా అతృపం యదావః । ఆపో హిష్ఠా.... చనః । దివి శ్రయస్వాన్తరిక్షే యతస్వ పృథివ్యా సంభవ బ్రహ్మవర్చసమసి బ్రహ్మవర్చసాయ త్వా ॥[1]

పవమానస్సువజర్జనః । పవిత్రేణ విచర్షణిః । యః పోతా స పునాతు మా । పునన్తుమా దేవజనాః । పునన్తు మనవో ధియా ॥ పునన్తు విశ్వ ఆయవః । జాతవేదః పవిత్రవత్ । పవిత్రేణ పునాహిమా । శుక్రేణ దేవదీద్యత్ । అగ్నే క్రత్వా క్రతూగ్ం రను । యత్తే పవిత్రమర్చిషి । అగ్నే వితతమన్తరా । బ్రహ్మ తేన పునీమహే। ఉభాభ్యాం దేవ సవితః । పవిత్రేణ సవేన చ । ఇదం బ్రహ్మపునీమహే । వైశ్వదేవీ పునతీ దేవ్యాగాత్ । యస్యై బహ్వీస్తనువో వీతపృష్ఠాః । తయా మదన్తస్సధమాద్యేషు। వయగ్గ్ంస్యామ పతయో రయీణామ్ । వైశ్వానరో రశ్మిభిర్మాపునాతు । వాతః ప్రాణేనేషిరో మయోభూః । ద్యావాపృథివీ పయసా పయోభిః । ఋతావరీ యజ్ఞియే మా పునీతామ్ । బృహద్భిస్సవితస్తృభిః । వర్షిష్ఠైర్దేవ మన్మభిః । అగ్నే దక్షైః పునాహి మా । యేన దేవా అపునత । యేనాపో దివ్యం కశః । తేన దివ్యేన బ్రహ్మణా । ఇదం బ్రహ్మ పునీమహే । యః పావమానీరధ్యేతి । ఋషిభిస్సంభృతగ్ం రసమ్ । సర్వగ్ం సపూతమశ్నాతి । స్వదితంమాతరిశ్వనా । పావమానీర్యో అధ్యేతి । ఋషిభిస్సంభృతగ్ం

1.సం. ౫-౬-౧

రసమ్ । తస్మై సరస్వతీ దుహే । క్షీరగ్ం సర్పిర్మధూదకమ్ । పావమానీ స్స్వస్త్యయనీః । సుదుఘా హి పయస్వతీః । ఋషిభిస్సంభృతో రసః । బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్। పావమానీర్దిశన్తు నః । ఇమం లోకమథో అముమ్ । కామాన్సమర్ధయన్తునః । దేవీర్దేవైస్స మాభృతాః । పావమానీ స్స్వస్త్యయనీః । సుదుఘా హి ఘృతశ్చుతః । ఋషిభిస్సంభృతో రసః । బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్ । యేన దేవాః పవిత్రేణ । ఆత్మానం పునతే సదా । తేన సహస్రధా రేణ । పావమాన్యః పునన్తు మా । ప్రాజాపత్యం పవిత్రమ్ । శతోద్యామగ్ం హిరణ్మయమ్ । తేన బ్రహ్మవిదో వయమ్ । పూతం బ్రహ్మ పునీమహే । ఇన్ద్రస్సునీతీ సహ మా పునాతు । సోమస్స్వ స్త్యా వరుణస్సమీచ్యా। యమో రాజా ప్రమృణాభిః పునాతు మా । జాతవేదా మోర్జయన్త్యా పునాతు॥[1]

భూః । భువః । సువః ॥[2]

తచ్ఛం యోరా వృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే । దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శంనో అస్తు ద్విపదే । శం చతుష్పదే (బ్రా.౩-౫-౧౧)

యో బ్రహ్మ బ్రహ్మణ ఉజ్జభార ప్రాణేశ్వరః[3] కృత్తివాసాః పినాకీ । ఈశానో దేవస్స న ఆయుర్దధాతు తస్మై జుహోమి హవిషా ఘృతేన । విభ్రాజమానస్సరిరస్య మధ్యాద్రోచమానో ఘర్మ రుచిర్య ఆగాత్ । స మృత్యుపాశానపనుద్య ఘోరానిహాయుషేణో ఘృతమత్తు దేవః । బ్రహ్మజ్యోతిర్బ్రహ్మపత్నీషు గర్భం యమాదధాత్పురురూపం జయన్తమ్ । సునర్ణరంభగ్రహమర్కమర్చం తమాయుషే

1.బ్రా. ౧-౪-౮ 2.యాజ్ఞికీ ౩౫ 3.ఉజ్జహార ప్రాణైశ్శిరః ఇతివా పాఠః

వర్ధయామో ఘృతేన ॥ శ్రియం లక్ష్మీమౌపలామమ్బి కాం గాం షష్ఠీం చ యామిన్ద్ర సేనేత్యుదాహుః । తాం విద్యాం బ్రహ్మయోనిగ్ం సురూపామిహాయుషే తర్పయామో ఘృతేన ॥ దాక్షాయణ్య స్సర్వయోన్యస్సుయోన్య స్సహస్రశో విశ్వరూపా విరూపాః । ససూనవస్సపతయస్సయూథ్యా ఇహాయుషేణో ఘృతమిదం జుషన్తామ్ ॥ దివ్యాగణా బహురూపాః పురాణా ఆయుచ్ఛి దో నః ప్రమథన్తు వీరాన్ ॥ తేభ్యో జుహోమి బహుధా ఘృతేన మా నః ప్రజాగ్ం రీరిషో మోత వీరాన్ । ఏకః పురస్తాద్య ఇదం బభూవ యతో బభూవుర్భువనస్య గోపాః । యమభ్యేతి భువనగ్ం సాంపరాయే స నో హవిర్ఘృతమిహాయుషేఽత్తు దేవః ॥ వసూన్రుద్రానాదిత్యాన్మరుతోఽథసాధ్యా న్ఋభూన్యక్షాన్గన్ధర్వాగ్ంశ్చ పితౄగ్ంశ్చ విశ్వాన్ । భృగూన్సర్పాగ్ంశ్చాఙ్గిరసోఽథ సర్వాన్ ఘృతగ్ం హుత్వా స్వాయుష్యమిహ యామ శశ్వత్ ॥ విష్ణోత్వం నో అన్తమశ్శర్మ యచ్ఛ సహన్త్య । ప్ర తే ధారా మధుశ్చుత ఉథ్సం దుహ్రతే అక్షితమ్ ।[1] నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః । పృథివ్యై నమ ఓషధీభ్యః । నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి[2] ॥ (ఏవంత్రిః) యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్ । తత్సర్వంక్షమ్యతాం దేవనారాయణ నమోఽస్తు తే ॥ విసర్గబిన్దుమాత్రాసు పదపాదాక్షరేషు చ । న్యూనాతిరిక్తం యత్కించిదాభిర్గీర్భిరుదీర యేత్ ॥ ఆభిర్గీర్భిర్యదతో న ఊనమాప్యాయయ హరివో వర్ధమానః । యదా స్తోతృభ్యో మహిగోత్రా రుజాసి భూయిష్ఠ భాజో అధతేస్యామ । బ్రహ్మ ప్రావాదిష్మతన్నో మా హాసీత్ । ఓం శాన్తి శ్శాన్తిశ్శాన్తిః ॥[3]

1.సం. ౩-౧-౧౧   2.ఆ. ౨-౧౨ 3. ఆ.౪-౪-౨

# ఇత్యుదకశాన్తిమన్త్రాః

తతో యజమానః బ్రహ్మవరుణాభ్యాం నమః ఛత్రాదిసర్వో పచారాన్ సమర్పయామీత్యుత్తరారాధనం కృత్వా, అనేన పూజావిధానేన ఉదకశాన్తిజపేన చ బ్రహ్మవరుణౌ ప్రీయేతామిత్యక్షతో దకదానపూర్వకమావాహిత దేవతావిసర్జనం విధాయ, ప్రణవేన కుమ్భముత్థాపయేత్ ॥

తతః – దేవస్య త్వా సవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యామ్ । పూష్ణో హస్తాభ్యామ్ ॥ అశ్వినోర్భైషజ్యేన । తేజసే బ్రహ్మవర్చసాయాభిషిఞ్చామి ॥ దేవస్య త్వాసవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యాం । పూష్ణో హస్తాభ్యామ్ । సరస్వత్యైభైషజ్యేన । వీర్యాయాన్నాద్యాయాభిషిఞ్చా మి ॥ దేవస్య త్వా సవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యాం। పూష్ణో హస్తాభ్యాం । ఇన్ద్రస్యేన్ద్రియేణ । శ్రియైయశసే బలాయాభిషిఞ్చామి ॥[1]

చ వాజినమ్ । సోమగ్ం రాజానం వరుణమగ్నిమన్వారభా మహే । ఆదిత్యాన్ విష్ణుగ్ం సూర్యం బ్రహ్మాణం చ బృహస్పతిమ్ । దేవస్యత్వా సవితుః ప్రసవేఽ శ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాగ్ం సరస్వత్యై వాచో యన్తుర్య న్త్రేణాగ్నేస్త్వా సామ్రాజ్యే నాభిషిఞ్చామీన్ద్రస్యబృహస్పతేస్త్వా సామ్రా జ్యేనాభిషిఞ్చామి ॥[2]

దేవాస్త్వేన్ద్రజ్యేష్ఠా వరుణ రాజానోఽధస్తాచ్చో పరిష్టాచ్చపాన్తు న వా ఏతేన పూతో న మేధ్యోన ప్రోక్షితో యదేనమతః ప్రాచీనం ప్రోక్షతి యద్భుఞ్చిత మాజ్యేన ప్రోక్షతి తేన పూతస్తేన మేధ్యస్తేనప్రోక్షితః[3] ॥ ఇతి మన్త్రైః వ్యాహృతీభిశ్చ బ్రాహ్మణా

1.బ్రా. ౨-౬-౫ 2. సం. ౧-౭-౧౦ 3. సం.౫-౫-౯

స్సకుటుమ్బం యజమానం ప్రోక్షయేయుః ॥ తతో యజమానః ఆప ఇద్వా ఉ భేషజీరాపో అమీవచాతనీః । ఆపస్సర్వస్య భేషజీస్తాస్తే కృణ్వన్తు భేషజమ్ [1]॥ ఆమయావీ చిన్వీత । ఆపోవై భేషజమ్ । భేషజమేవాస్మై కరోతి । సర్వమాయురేతి [2]॥

ఇతి మన్త్రాభ్యాం తీర్థం ప్రాశ్య, పురస్తాదుపవిశతే హిరణ్యం, దక్షిణత ఉపవిశతే రజతం, పశ్చాదుపవిశతే కాంస్యం, ఉత్తరత ఉపవిశతే వాసశ్చ దక్షిణాం దత్వా, కుమ్భజలేన స్నా త్వా, మన్త్రా క్షతపూర్వకమాశీర్వచనం బ్రాహ్మణేభ్యో గృహీత్వా, కాయేన వాచా మనసేన్ద్రియైర్వా బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతేస్స్వభావాత్ । కరోమియద్యత్సకలంపరస్మైనారాయణాయేతి సమర్పయామి॥ ఇతి కృతం కర్మ భగవతే సమర్పయేత్॥

## ఇత్యుదకశాన్తివిధిః

ఇదం చోదకశాన్తినామకం కర్మ గర్భాధాన పుంసువన సీమన్తోన్నయన చౌలోపనయనవివాహాగ్న్యాధేయాది శుభకర్మసు ఉగ్రరథభీమరథాఖ్యాది మహాశాన్తి కర్మసు చ తదఙ్గత్వేన, మహోత్పాతమహాభయమహాపీడాదిపరిహారాపేక్షిభిః, ఆయురారోగ్యైశ్వర్యాద్యభివృద్ధికామిభిశ్చ సభక్తిశ్రద్ధం । యథావిధ్యాచరితంచేదిష్టసిద్ధి ర్భగవన్ముఖోల్లాసశ్చ భవిష్యతీతి శిష్టజనాభిప్రాయః ॥

1.ఋ.సం. ౮-౭-౨౫ 2.ఆ.౧-౨౬

# శ్రాద్ధవిషయక ధర్మములు.

శ్లో॥ సంస్కృతం వ్యంజనాద్యంచ, పయోమధుఘృతాన్వితమ్ ।
శ్రద్ధయా దీయతే యస్మాత్ శ్రాద్ధం తేన నిగద్యతే ॥
- (హేమాద్రౌ బృహస్పతిః)

శ్లో॥ దేశే కాలేచ పాత్రేచ శ్రద్ధయా విధినాచ యత్ ।
పిత్ర్యానుద్దిశ్య విప్రేభ్యో దత్తం శ్రాద్ధముదీరితమ్ ॥
- (మాధవీయే, బ్రహ్మాండేపి)

పాలు, తేనె, నెయ్యి, కూరలతో చక్కగా వండబడిన పదార్థములను శ్రద్ధగా భోక్తల కర్పించుటయే శ్రాద్ధమనబడును-దేశకాల పాత్రములు యోగ్యములై శ్రద్ధగా విధివిధానముగా పితరులనుద్దేశించి భోక్తలకిచ్చుటయే శ్రాద్ధమనబడును.

## యోగ్యాబ్రాహ్మణాః

సూ॥ శుచీన్ మంత్రవతో యోనిగోత్ర మంత్రా సంబంధాన్ అయుగ్మాగ్ స్త్ర్యవరాన్ అనర్థావేక్షో భోజయేత్ -ఆ-గృ-సూ-౨౧-౨

శుచిర్భూతులై మంత్ర, బ్రాహ్మణాది వేదజ్ఞులైన భోక్తలు శ్రేష్ఠము. విద్యావంతులుగాకున్ననూ, శుచిర్భూతులై సాంప్రదాయమెరింగి నిత్యనైమిత్తిక కర్మాచరణ చేయువారు ప్రశస్తము. మామగారు, మేనమామ పుత్రులు, ఏకగోత్రులు, జ్ఞాతులు, యజమాని, యాజ్ఞికుడు, గురువుగారు, శిష్యుడు, ఋత్విక్కు, ఇటువంటి వారిని మధ్యమ విప్రులుగా చెప్పినందున అభావమున నియమించవచ్చునని తెలియుచున్నది-

శ్లో॥ నైకగోత్రే హవిర్దద్యాత్ యథాకన్యా తథాహవిః ।
అభావే హ్యన్య గోత్రాణాం ఏకగోత్రాంస్తుభోజయేత్ ॥

శ్లో॥ నిధాయ దర్భకవటూన్ ఆసనేషు సమాహితః ।
ప్రైషాను ప్రేషసంయుక్తం, విధానం పరికల్పయేత్ ॥

సగోత్రులకు కన్యాదానము ఎటులచేయకూడదో అటులనే భోక్తలుగా సగోత్రుల నుంచరాదు. అభావమున విశ్వేదేవ భోక్తలుగా సగోత్రుల నుంచవచ్చును. బ్రాహ్మణా భావములో దర్భలతో కూర్చజేసి దానియందు ఆవాహన చేసి తన్నివేదితాన్నమును అగ్నిలోగానీ, జలములోగానీ వేయవచ్చును.

శ్లో ॥ యజ్ఞవస్తుని ముష్టౌచ, స్తంబే దర్భవటౌ తథా ।
దర్భసంఖ్యా నవిహితా కూర్చే సంస్తరణేపిచ ॥

యజ్ఞసంబంధమైన వస్తువులయందునూ, (ఇష్టిలోవాడు వేదము మొదలుగా గలవి) దర్భముష్టి యనుచోటనూ, దర్భస్తంబేవా నిదధాతి । అనుచోటనూ, బ్రాహ్మణ ప్రతినిధిగా అర్చన చేయుదర్భవటుకమందునూ, కూర్చలకూ, ఆస్తరణముల యందునూ దర్భసంఖ్యా నియమము లేదు.

శ్లో॥ పూర్వేద్యు శ్శ్రాద్ధకర్తారం, తద్భోక్తారంచ పరేహని ।
శవాను గామినం చైవ వర్జయే చ్ఛ్రాద్ధ కర్మణి ॥

పూర్వదినమందు ఆబ్దిక మాచరించిన కర్తయూ, పూర్వదినమందు భోక్తవ్యము చేసిన బ్రాహ్మణులు, శవమును మోసిన వారు, శవముతో శ్మశానమునకు వెళ్ళినవారు ఆరోజున శ్రాద్ధభోక్తలుగా వర్జనీయులు.

శ్లో॥ దౌహిత్రః కుతపః కాలః ఛాగః కృష్ణాజినం తథా ।

రౌప్యం దర్భాస్తిలా గావః ఖడ్గపాత్రం పితృ ప్రియమ్ ॥

అనగా దౌహిత్రుడు, కుతపకాలము. (అనగా సూర్యోదయమునుండి 8వ ముహూర్తము - ముహూర్తమనగా 48 నిమిషముల కాలము-) ఛాగసాన్నిధ్యము (మేకసామీప్యము) జింక చర్మము, వెండి వస్తువులు దర్భలు, నువ్వులు, గోవులు కొమ్ముతో చేసిన పాత్రలు పితృ ప్రీతికరములు-

## విశ్వేదేవులు-

విశ్వేదేవులకు నామ భేదము చెప్పని పార్వణ శ్రాద్ధములన్నిటిలో పూరూరవార్ద్రవ సంజ్ఞకు లే అగుదురు- కామ్యశ్రాద్ధములందునూ, తీర్థ,మహాలయము లందునూ ధురివిలోచన సంజ్ఞకులు.

సపిండీకరణ శ్రాద్ధమందు కాల, కామక సంజ్ఞకులు. నాందీ శ్రాద్ధమున సత్యవసు సంజ్ఞకులు.

విశేషమేమనగా, గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయన సంస్కారాంగమైన నాందీ శ్రాద్ధమునందునూ, అగ్న్యాధాన, సోమయాగాంగమైన ఇష్టి శ్రాద్ధమునందునూ, దక్ష, క్రతు సంజ్ఞకులు విశ్వేదేవులు-హిరణ్య శ్రాద్ధములందు ధను, రుచి సంజ్ఞకులు, ఏకోద్దిష్టశ్రాద్ధము నందు రుద్ర సంజ్ఞ గల విశ్వేదేవుడు.

## షణ్ణవతి శ్రాద్ధములు

శ్లో॥ అమా మను యుగ క్రాంత ధృతిపాత మహాలయాః ।
తిస్రోష్టకాశ్చ విజ్ఞేయా షణ్ణవత్యః ప్రకీర్తితాః ॥

అనగా అమావాస్యలు 12 - మన్వాదులు 14 - యుగాదులు-4 సంక్రాంతులు- 12 - వైధృతియోగములు. 13-వ్యతీపాద్యోగములు 13

వ్యతీపాద్యోగములు 13 మహాలయములు - 16 -తి[స్రోష్టకలు-12 మొత్తం 96 [శ్రాద్ధములు [ప్రతిసంవత్సరము, మాతాపితృ ఆబ్దికములు గాక ఆచరించవలసినవి. ఇందు అపరాహ్ణ వ్యాప్తమైన అమావాస్యలలో దర్శ[శ్రాద్ధము చేయవలెను. ఇందు సపత్నీక పితృ, సపత్నీకమాతామహయను షడ్దైవత్యము, విశ్వేదేవసహితముగా చేయవలెను. ఇందు తిలతర్పణ ముందుగానే చేయవలెను. ఇక మన్వాదులు-14.

| | | | |
|---|---|---|---|
| 1. | చైత్రశుద్ధ తదియ | - | ఉత్తమ మన్వాది |
| 2. | చైత్రపౌర్ణమీ | - | రౌచ్యక మన్వాది |
| 3. | జ్యేష్ఠ పౌర్ణమీ | - | భౌచ్యక మన్వాది |
| 4. | ఆషాఢ శుద్ధ దశమి | - | చాక్షుష మన్వాది |
| 5. | ఆషాఢ బహుళ అష్టమీ | - | రుద్రసావర్ణిక మన్వాది |
| 6. | [శ్రావణ బహుళ అమావాస్య | - | అగ్నిసావర్ణిక మన్వాది |
| 7. | భాద్రపద శుద్ధ తదియ | - | తామ సమన్వాది |
| 8. | భాద్రపద బహుళ అష్టమీ | - | సూర్య సావర్ణికమన్వాది |
| 9. | ఆశ్వయుజ శుద్ధ నవమీ | - | స్వారోచిష మన్వాది |
| 10. | కార్తికశుద్ధ ద్వాదశీ | - | స్వాయంభువ మన్వాది |
| 11. | కార్తిక పౌర్ణమీ | - | ఇంద్రసావర్ణిక మన్వాది |
| 12. | పౌష శుద్ధ ఏకాదశీ | - | రైవత మన్వాది |
| 13. | మాఘశుద్ధ సప్తమీ | - | వైవస్వత మన్వాది |
| 14. | ఫాల్గుణ పౌర్ణమీ | - | బ్రహ్మసావర్ణిక మన్వాది |

ఈ మన్వాదులందు జరుపు [శ్రాద్ధములు పిండరహితముగా చేయవలెను- హిరణ్య విధానముగా ఆచరించవచ్చును. ఈ మన్వాదులందు పితరులకు

శ్రాద్ధముచేయుటచే రెండువేల సంవత్సరములు పితృదేవతలు తృప్తి నొందుదురు.

షడ్దైవత్యముగా, ధను, రుచి, విశ్వేదేవతలను అర్చించవలెను. శ్రాద్ధమునకు ముందుగానే తిల తర్పణ చేయవలెను.

## యుగాదులు-4

1. కార్తిక శుద్ధ నవమీ - కృతయుగాది
2. వైశాఖ శుద్ధ తదియ - త్రేతా యుగాది
3. మాఘబహుళ అమావాస్యా - ద్వాపర యుగాది
4. భాద్రపద బహుళ త్రయోదశీ - కలి యుగాది

యుగాదులలో మన్వాదుల వలెనే శ్రాద్ధనియమములు ఆచరించవలెను.

## సంక్రాంతులు

సంక్రాంతి అనగా సూర్యుడు రాశిలో ప్రవేశించుట అని అర్థము. ఉదా:- సూర్యుడు మేషరాశి ప్రవేశము. మేష సంక్రాంతి అందురు. సంవత్సరమునకు 12 సంక్రాంతులు వచ్చును. సంక్రమణములలోని పుణ్యకాలముల మార్పును ఈ క్రింద గమనించగలరు. ఘడియ అనగా 24 నిమిషములు.

1. మేష సంక్రమణమున - (15) పూర్వము, తరువాత కూడా 10 ఘడియలు పుణ్యకాలము.
2. వృషభ సంక్రమణమున(పరము)- పూర్వము 16 ఘడియలు పుణ్యకాలము.
3. మిధున సంక్రమణమున - ప్రవేశము తర్వాత 16 ఘడియలు పుణ్యకాలము

4. కర్కాటక సంక్రమణమున - ప్రవేశాత్పూర్వం 30 ఘడియలు పుణ్యకాలము

5. సింహ సంక్రమణమున (పూర్వ) - ప్రవేశము తర్వాత 16 ఘడియలు పుణ్యకాలము

6. కన్యా సంక్రమణమున - ప్రవేశముతర్వాత 16 ఘడియలు పుణ్యకాలము

7. తులా సంక్రమణమున - పూర్వము, తరువాత కూడా 10 ఘడియలు పుణ్యకాలము

8. వృశ్చిక సంక్రమణమున - పూర్వము, తరువాత కూడా 10 ఘడియలు పుణ్యకాలము

9. ధనుః సంక్రమణమున - ప్రవేశానంతరం 16 ఘడియలు పుణ్యకాలము

10. మకర సంక్రమణమున - ప్రవేశానంతరం 40 ఘడియలు పుణ్యకాలము.

11. కుంభ సంక్రమణమున - పూర్వము 16 ఘడియలు పుణ్యకాలము

12. మీన సంక్రమణమున - ప్రవేశానంతరం 16 ఘడియలు పుణ్యకాలము.

సహజముగా ప్రతి సంక్రాంతికి 16 ఘడియలు ముందు, వెనుకలు పుణ్యసమయమే - పైన పేర్కొనిన పుణ్యకాలములు. హేమాద్రి పండితునిచే చెప్పబడినవి. విశేష ఫలదాయకములు. వీటిలో

1. వృషభ-సింహ-వృశ్చిక-కుంభ సంక్రమణములను విష్ణుపద పుణ్య కాలమందురు.

2. మిధున- కన్యా, ధనుర్మీన సంక్రమణములు షడశీతియనియూ

3. మేష, తులా సంక్రమణములు విషువపుణ్య కాలమనియూ,

4. కర్కాటక, మకర సంక్రమణములు అయన పుణ్యకాలమనియూ అందురు-ఇవి ఒకదానికంటే రెండవది అత్యన్త పుణ్యప్రదము - అనగా

1కంటే 2వది 2వ వాటికంటే 3వది, 3వ వాటికంటే 4వది- పుణ్యాధిక్యములైయున్నవి.

సంక్రమణములకు పూర్వోత్తరము 16 ఘడియలకాలము శుభ కర్మార్హము కాదు- సంక్రమణ శ్రాద్ధమును పిండ రహితముగా షడ్దైవత్యముగా ఆచరించవచ్చును. తిలతర్పణ ముందే చేయవలెను. అన్ని సంక్రమణశ్రాద్ధములు ఆచరించలేకపోయినా కనీసము, కర్కాటక, మకర సంక్రమణ శ్రాద్ధములైనా అవశ్య మాచరణీయములు.

పైన పేర్కొనిన పుణ్య కాలములలో మతభేదములు గూడా కలవు.

## వైధృతి, వ్యతీపాత్‌లు.

నక్షత్రములవలెనే 27 యోగములు కలవు- అందు 17వది వ్యతీపాద్యోగము- 27 వది వైధృతియోగము. పంచాగముననుసరించి ఈ యోగములు వచ్చిన రోజు ఆశ్రాద్ధమునాచరించవలెను- 1 సంవత్సరమునకు 13 వైధృతులు 13 వ్యతీపాత్‌లు వచ్చును- మొత్తం 26. ఈ 26 శ్రాద్ధములు, పూర్వమువలే, పిండరహితముగా, షడ్దైవత్యముగా, ముందే తిలతర్పణతో చేయవలెను.

## మహాలయము

మహాలయశ్రాద్ధములు 16 - అనగా భాద్రపద కృష్ణపాద్యమినుండి అమావాస్యా పర్యంతం 15 రోజులు పక్షశ్రాద్ధము చేయవలెను.

శ్లో॥ మహాలయే గయాశ్రాద్ధే వృద్ధౌచాన్వష్టకాసుచ ।
నవదైవత మత్రేష్టం శేషం షాట్పూరుషం విదుః ॥

అనగా పక్షమహాలయ శ్రాద్ధములో నవదైవత్యము నర్చించవలెను-

పిత్రాదిత్రయము 1 పార్వణ. మాత్రాదిత్రయము 1 పార్వణ సపత్నీక మాతామహులు 1 పార్వణ. ధురి, విలోచన సంజ్ఞకులు విశ్వేదేవతలు- శ్రాద్ధాంతమందు అంగతిలతర్పణము చేయవలెను- ఇది చేయుటకు అశక్తులైనచో ఒక్క దినమున సర్వదైవత్యముగా, అనగా మాతృత్రయ సహిత పితృత్రయము- 1.సపత్నీక మాతామహత్రయం- 2.ఆత్మ పత్న్యాది కారుణ్య వర్గము 3.విశ్వేదేవులు- 4.నలుగురు భోక్తలతో అన్నశ్రాద్ధము చేయుట దీనికి పరేహని తిలతర్పణము చేయవలెను.

శ్లో॥ మహాలయే, గయాశ్రాద్ధే, మాతా పిత్రోర్మృతేహని ।
కృతో&ద్వాహోపి కుర్వీత పిండదానం యథావిధి ॥

అని యున్నందున ఈమహాలయములు శుభకర్మలనాచరించిననూ అన్న శ్రాద్ధము చేయవలయును- మరియునూ ఈ మహాలయము, ఆమ, హిరణ్యాదులతో చేయకూడదు అన్న శ్రాద్ధమే చేయవలెను. ఇవి 15 పక్షమహాలయశ్రాద్ధములు 1.సకృన్మహాలయము - ఇక ఆశ్వయుజ శుద్ధ ప్రతిపత్తిథి నాడు కేవల మాతామహుల నుద్దేశించి ఒక మహాలయము పెట్టవలెను - ధురి, విలోచన విశ్వేదేవతలు, శ్రాద్ధాంతమందు తర్పణము. ఇది - జీవత్పితృకుడైనూ, అవశ్యము చేయవలెనని నిబంధన గ్రంథములందు కన్పించుచున్నది.

## త్రిసోష్టకలు 4 × 3 = 12

మార్గశిర, పౌష, మాఘ, ఫాల్గుణ మాసములలో బహుళ సప్తమి, అష్టమీ, నవమీ తిథులందు చేయు శ్రాద్ధములు. ఈ శ్రాద్ధములు నవదైవత్యముగా మాసి శ్రాద్ధ ప్రకృతికముగా చేయవలెను- శ్రాద్ధానంతర తర్పణము. పురూరవార్ద్రవ సంజ్ఞకులు విశ్వేదేవులు.

ఈ యష్టకా శ్రాద్ధమునందు గోవపాయాగము విహితమైననూ కలియుగ నిషేధ కారణముగా దధ్యంజలి హోమము చేయవలెను.

శ్లో ॥ అశ్వాలంభం, గవాలంభం సన్యాసం పలపైతృకమ్ ।
దేవరాచ్చ సుతో త్పత్తిః కలౌపంచ విసర్జయేత్ ॥
అథైతదపరం, దధ్నఏవాంజలినా జుహోతి యయాఽపూపమ్

– ఆ.గృ.సూ. 22.40.10 సూ–

సప్తమినాడు రాత్రి అపూపహోమముచేసి, అష్టమినాడు దధ్యంజలి హోమము, నవమినాడు మాసిశ్రాద్ధవత్ అన్వష్టకా శ్రాద్ధము జరుపుట యుక్తము. ఇవి షణ్ణవతి శ్రాద్ధములు. ఇంకనూ యమాగజచ్ఛాయా శ్రాద్ధము. అనగా హస్తా నక్షత్రములో సూర్యుడుండగా అమావాస్యాహస్తా నక్షత్రమైన రోజున చేయదగిన శ్రాద్ధము పేరు యమాగజచ్ఛాయా శ్రాద్ధము. ఆ రోజున చేయు దానధర్మములనంత ఫలమౌను.

## యమతర్పణము

ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి, అనగానరక చతుర్దశి రోజున జీవత్పితృకుడైన సవ్యముగా యవలతోగానీ అక్షతలతోగానీ దేవతీర్థముగా యమధర్మరాజునుద్దేశించి చేయుతర్పణము యమతర్పణమనబడును–

అజీవపితృకులైనచో ప్రాచీనా వీతముగా, తిలలతో పితృతీర్థముగా చేయవలెను– యమాయనమః–యమంతర్పయామి– అను విధముగా ముమ్మారు తర్పణచేయవలెను–

1. యమాయ నమః 2. ధర్మరాజాయనమః 3. మృత్యవేనమః 4. అంతకాయ

నమః 5. వైవ స్వతాయ నమః 6.కాలాయనమః 7.సర్వభూత క్షయాయనమః 8.ఔదుంబరాయనమః 9.దధ్నాయ నమః 10.నీలాయనమః 11.పరమేష్ఠినే నమః 12.వృకోదరాయనమః 13.చిత్రాయనమః 14.చిత్రగుప్తాయనమః అని ఒక్కొక్క మంత్రమును ముమ్మారు ఉచ్చరించుచూ తర్పణ చేసిన సమస్త పాపక్షయమగును.

## అర్ధోదయ, మహోదయములు

శ్లో॥ అమార్కపాత శ్రవణైర్యుక్తా చేత్పౌషమాఘయోః ।
అర్ధోదయస్స విజ్ఞేయః కోటి సూర్యగ్రహైస్సమః ॥

పౌష, మాఘమాసములలోని అమావాస్యనాడు, ఆదివారము, శ్రవణానక్షత్రము, వ్యతీపాద్యోగము కలిసినచో అది అర్ధోదయ పర్వము అనబడును- ఇది కోటిసూర్యగ్రహణ సమాన ఫలమని చెప్పబడుచున్నది- ఈ యోగము మధ్యాహ్నము ఉన్న రోజున పర్వమని యెరుంగ వలెను- ఆరోజున చేయు దాన, శ్రాద్ధ, అనుష్ఠానములు అనంత ఫలదాయకములగును-"కించిన్న్యూనం మహోదయః " అని యుండుటచే ఏదైన ఒకటి తగ్గినచో అది మహోదయ పర్వమందురు. దానియందునూ పైవలెనే కర్మలు ఆచరణీయములు.

## త్రైపక్షిక, ఊనషాణ్మాసిక కాలవిచారః.

ఊనమాసికమనగా నెలకు ముందుగా పెట్టునది అని అర్థము. ప్రస్తుతము లోకములో 12వ రోజున ఊన మాసికము ఆచరించుచున్నారు. కానీ ఇది మృతాహస్సునుండి 28 దినముల లోపుగూడా ఆచరించవచ్చును- ద్వితీయమాసికమనగా మృతాహస్సుకు తర్వాత నెలలోని ఆ తిథియందు ద్వితీయమాసికము నిర్వహించవలెను- అనగా మృతినొందిన నెలరోజులకే

ద్వితీయమాసికము పెట్టవలెను. అనగా రెండవనెలలోని మొదటి రోజునే ద్వితీయ మాసికము. అటులనే అన్ని నెలమాసికములకూ చేయవలెను. ఇక రెండవ మాసికము పెట్టిన 5 రోజుల లోపుగా భాను, భౌమ, భృగు, ద్వి,త్రిపాద నక్షత్రములు లేకుండానూ ధనిష్ఠా పంచకములేకుండా త్రైపక్షిక మాచరించునది. ఆ 5 రోజులలో మంచిరోజు దొరకనిచో చివరిదగు 5వరోజునే త్రైపక్షిక శ్రాద్ధము ఆచరించవలెను. అటులనే 6వ మాసము మొదటి రోజున షాణ్మాసికము ఆచరించి తదుపరి 20 రోజుల నుండి 25 రోజులలోపుగా ఊన షాణ్మాసికము చేయవలెను. త్రైపక్షికమునకున్న వారాది నియమములతోనే జరుపవలెను. ఇక్కడ కూడా మంచిరోజు దొరకని యడల 25వ రోజునే జరుపుట యుక్తము. ఇక ఏడవనెల మొదటలో సప్తమమాసికము. చేయదగును. ఇటులనే ఊనాబ్దికము కూడా ప్రథమాబ్దికమునకు ముందు 5 రోజులనుండి మంచిరోజులో చేయవచ్చును – ప్రస్తుతము సౌకర్యార్థము సంవత్సర విమోకమునకు ముందు రోజే ఆచరించుచున్నారు.

**అధికమాస విచారః :** అధిక మాసమందు మరణించినవార్కి అధిక మాసములోనే సపిండీకరణ మొనరించవలెను. శుద్ధమాసమున మృతతిథియందు అన్వాద్యమాసిక మాచరించి, తదుపరి రోజులలో ఊనమాసికము జరుపవలెను. తదుపరినెలలోని మృతతిథి యందు ద్వితీయమాసికముపెట్టి ఆపైన 5 రోజులలోపు త్రైపక్షిక మాసికము పెట్టవలెను. అంతేగానీ మృత తిథినుండి మూడవ పక్షములో త్రైపక్షికము పెట్టరాదు. అధికమాసమృతి యందు మాత్రమే పై విశేషము అని తెలియవలెను. ఇతరత్రా మృతిజరిగినచో మూడవ పక్షమందే త్రైపక్షికమగును – ఇక సంవత్సర విమోకములు పెట్టవలసి వచ్చినప్పుడు అధికమాసము వచ్చినచో అధికకమాసములోనే సాంవత్సర విమోకములు, ప్రథమాబ్దికము జరుపవలెను– నిజమాసమందు ఏమియు

చేయనక్కరలేదు.

శ్లో॥ మలిమ్లుచే మాసి మృతస్య పుంసః త్రయోదశేతు ప్రథమాబ్దికం స్యాత్ ।
మధ్యేధి మాసేతు పునస్తథైవ అంత్యేఽధికే ద్వాదశ మాస ఏవ ॥

అటులనే సంవత్సరము మధ్యలో అధిక మాసము వచ్చినచో అధిక మాసములో ఉదా:- మలమాస ప్రయుక్త సప్తమ మాసికాఖ్యాన్న శ్రాద్ధం, అనీ, నిజమాసమందు నిజమాసప్రయుక్త సప్తమ మాసికశ్రాద్ధం అనీ చెప్పి యధావిధిగా రెండు మాసికములు పెట్టవలెను- అధిక మాసమందు మరణించినా, సంవత్సరమధ్యలో అధికమాసం వచ్చినా/మాసికము అధికముగా పెట్టవలసి యుండును. చివరలో అధిక మాసమైతే ఆ అధికమాసమందే సాంవత్సర విమోకములు జరుపవలెనని తాత్పర్యము. అధికముగా మాసికములుండవు.

## వివిధకర్తృక శ్రాద్ధములందు సంకల్పవిశేషములు

స్వకర్తృకమైన ఆత్మపత్నీ శ్రాద్ధము ఆచరించునప్పుడు అస్మత్ ఆత్మపత్ని, తద్భర్తృ మాతృ, పితా మహీనాం, అనియూ, స్వకర్తృకమైన భ్రాతృ శ్రాద్ధములందు అస్మత్ జ్యేష్ఠభ్రాతృ, (కనిష్ఠభ్రాతృ) (సన్నిహిత జ్యేష్ఠభ్రాతృ) (వ్యవహిత కనిష్ఠభ్రాతృ) తత్పితృ, పితామహానాం, అనియూ, మేనత్తలు, పినతల్లి, పెత్తల్లులకు స్వకర్తృకముగా చేయునప్పుడు, అస్మత్ పితృభగినీ, (మాతృభగినీ) తద్భర్తృ మాతృ, పితామహీనాం అనియూ, తన కుమారునకు స్వకర్తృకముగా శ్రాద్ధము చేయునెడ, అస్మత్ సుత, తత్పితామహ, ప్రపితామహానాం, అనియూ, సంకల్పము చెప్పవలెను. అన్య కర్తృకములప్పుడు గూడా వారి వారి సంబంధమును ఉచ్చరించి (యజమానాయాః భర్తృ, తత్పితృ, పితామహానాం అని, విధవా కర్తృక భర్తృ శ్రాద్ధమందు) చెప్పవలెను. అనగా వర్గత్రయము సూటిగా లేనిచో తచ్ఛబ్దమును ఉపయోగించి చెప్పవలెనుట.

## అగ్నౌకరణ విషయః

శ్లో ॥ పితుర్మాతుశ్చ భార్యాయాః, జ్యేష్ఠభ్రాతృ పితృవ్యయోః ।
ఔపాసనాగ్నౌ కుర్వీత కుర్యాదన్యత్ర లౌకికే ॥

తల్లిదండ్రులకు, పునర్వివాహము చేసుకొనినచో జ్యేష్ఠభార్య ప్రత్యాబ్దికమందునూ, అన్నగార్ల, పినతండ్రి, పెత్తండ్రుల ఆబ్దికములందునూ, స్వకర్తృకమైనచో ఔపాసనాగ్నియందే అగ్నౌకరణము చేయవలెను-మాతామహ, మాతామహిలకున్నూ ఔపాసనాగ్ని యందే అగ్నౌకరణము.

ఇందులో చెప్పని, సుత, కనిష్ఠభ్రాతృ, మాతుల, పితృభగినీ, ఆత్మభగిన్యాదులందరకూ స్వకర్తృకమైననూ లౌకికాగ్నియందే అగ్నౌకరణము చేయవలెను.

బ్రహ్మచారి కర్తయగుచో లౌకికాగ్ని యందే అగ్నౌకరణము గృహస్థు అయినచో ఔపాసనాగ్నియందు మొదట తెల్పిన వార్కి మాత్రమే అగ్నౌకరణ చేయవలెను.

విధురుడు (భార్యగతించినవాడు) అయినచో విధురౌపాసనాగ్ని యందుగానీ, లౌకికాగ్నియందు గానీ- హోమము చేయవలెను.

## కాశ్యాంస్నానసంకల్పః

భారతవర్షే, భరత ఖండే, వింధ్యస్యోత్తర దిగ్భాగే, ఆర్యావర్తైకదేశే, అవిముక్త వారాణసీ క్షేత్రే, అసీ వరుణయోర్మధ్యే, ఆనందవనే, మహా శ్మశానే, గౌరీముఖే, త్రిఖండిత విరాజితే, ఉత్తరవాహిన్యాః భాగీరథ్యాః, పశ్చిమేతీరే, బ్రహ్మనాళే, శ్రీవిశ్వేశ్వరాది త్రయస్త్రిం శత్కోటి దేవతా సన్నిధౌ, విక్రమశకే, బౌద్ధావతారే, అస్మిన్

వర్తమాన వ్యావహారిక బార్హస్పత్య మానేన...... వత్సరే.......... అయనే ..........
ఋతౌ,........ మాసే........... పక్షే............ తిథౌ.......... వాసరే, అస్మిన్
వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన.........నామసంవత్సరే ......... అయనే .......
ఋతౌ ............ మాసే ........, పక్షే......... తిథౌ, ....... వాసరే, శుభ
నక్షత్రే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్గోత్రః
.......... నామధేయః, ధర్మపత్నీ సమేతోహం మమ ఇహ జన్మని జన్మాంతరకృత,
మహాపాతక ఉపపాతక, సమస్త పాప క్షయార్థం, అఖండ భాగీరథీ నదీ స్నాన
మహం కరిష్యే ॥

## శ్రాద్ధే

పూర్వోక్త సంకల్పం పఠిత్వా, ప్రాచీనావీతీ, అస్మత్ పితౄణాం అక్షయ్య పుణ్యలోకఫలావాప్త్యర్థం, శ్రీవారాణసీక్షేత్రే, భాగీరథీ తీర్థాఖ్య హిరణ్య శ్రాద్ధం కరిష్యే॥

## ప్రయాగే సంకల్పః

ఏవం ప్రీత్యర్థం, శుభే శోభనేముహూర్తే .......... మేరోర్దక్షిణ దిగ్భాగే, వింధ్య స్యోత్తరే ప్రదేశే, ఆర్యావర్తదేశే, విష్ణు ప్రజాపతిక్షేత్రే, వటస్యపూర్వదేశే షట్కూల మధ్యే, అంత ర్వేద్యాం, భాగీరథ్యాః పశ్చిమేతీరే, త్రివేణీ సంగమే, మాధవక్షేత్రే, విక్రమశకే, బౌద్ధావతారే, బార్హస్పత్య మానేన....... సంవత్సరే, అయనే మాసే, తిథౌ – అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన...........

## గయాయాం సంకల్పః

భారతవర్షే, మేరోర్దక్షిణ దిగ్భాగే, ఆర్యావర్త అంతర్గత మగధదేశే, చంపకారణ్యే, మధువనే కోలాహలపర్వతే, గయా గదాధర క్షేత్రే, విష్ణుపాదే, వటక్షేత్రే,

ఫల్గుణీనదీతీరే బార్హస్పత్యమానేన....... అస్మిన్వర్తమాన వ్యావహారిక చంద్రమానేన.......... శుభతిథౌ, సమస్త పాపక్షయద్వారా పితృప్రీత్యర్థం, ఫల్గుణీ నదీస్నానమహం కరిష్యే

## శ్రాద్ధే

అస్మత్ పితౄణాం శాశ్వత బ్రహ్మలోకా వాప్త్యర్థం,
గయాశ్రాద్ధ మహం కరిష్యే ।

పవిత్రమునకు దర్భలెన్ని?

దైవే కర్మణి ద్వౌ దర్భౌ, పిత్ర్యే తత్ త్రిభిరీరితమ్ । అనగా, దేవ పవిత్రమునకు రెండు దర్భలు, పితృపవిత్రమునకు మూడు దర్భలు, ప్రేతకార్యములో ధరించు పవిత్రమునకు ఒక దర్భ ఉండవలెను.

కూర్చకు దర్భలెన్ని?

శ్లో॥ ప్రథమాబ్దే పంచదర్భైః ప్రత్యబ్దే సప్త భిస్తథా ।
తీర్థే మహాలయేచైవ నవదర్భైస్తుకూర్చకః ।
దర్శేపంచాబ్దికేసప్త నవతీర్థే మహాలయే ।

అను వచనములవలన దర్శశ్రాద్ధ, మాసిక, ప్రథమాబ్దికములందు 5 దర్భలతోనూ, ప్రత్యాబ్దికమునందు 7 దర్భలతోనూ, తీర్థ, మహాలయాదులయందు 9 దర్భలతోనూ కూర్చ నిర్మించవలెను.

## కలౌనిషిద్ధాని

సముద్రయాత్రా, స్వీకారః, కమండలు విధారణమ్ ।

ద్విజానాం అసవర్ణాసు కన్యాసు గమనం తథా ॥

దేవరాచ్చ సుతోత్పత్తిం మధుపర్కే పశోర్వధః ।
మాంసదానం తథాశ్రాద్ధే వానప్రస్థా శ్రమస్తథా ॥

దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానం పరస్యచ ।
దీర్ఘకాలం బ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ ॥

మహాప్రస్థాన గమనం గోమేధః శతధామఖాః ।
ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యాన్యాహు ర్మనీషిణః ॥

కలి యుగ మందు నిషేధించిన కర్మలు - (1) సముద్రముమీద ప్రయాణము, కుటీచక సన్యాసము, బహూదక సన్యాసము, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ఇతర వర్ణస్థుల కన్యలనుగూడుట, మరుదులు, బావగార్లవలన గర్భము ధరించుట, వివాహ, యజ్ఞాదులయందు మధుపర్కములో గోమాంసమిచ్చుట, అటులనే శ్రాద్ధములందు మాంసభోజనమిడుట, వనములలో నివసించు వానప్రస్థాశ్రమము స్వీకరించుట, కన్యను దానము చేసిన పిమ్మట మరల ఆకన్యను ఇంకొకరికి దానమిచ్చుట, ఎక్కువకాలము బ్రహ్మచర్యమును ధరించుట, నరమేధ, అశ్వమేధయాగములు సలుపుట, మరణకాంక్షియై తీర్థయాత్రాక్షేత్రములకరుగుట, గోమేధ యాగము, అతిగా యజ్ఞములు చేయుట, మొదలగునవి, యుగాంతరములందు చేసినవి అయిననూ ఈకలి యుగమందు నిషేధమని పెద్దలవచనము.

## పితృవర్గ నిర్ణయశ్లోకః

శ్లో॥ ఆదౌపితా తథామాతా సాపత్నీ జననీ తథా ।
మాతామహో స్సపత్నీకా ఆత్మపత్నీ త్వనంతరం ॥

సుత భ్రాతృ పితృ వ్యాశ్చ మాతులాస్సహ భార్యకాః ।
దుహితా భగినీ చైవ దౌహిత్రో భాగినేయకః ॥

పితృష్వసా మాతృష్వసా జామాతా భావుక స్నుషా ।
శ్వశుర స్యాలక శ్వశ్రూః స్వామినో గురురిక్థినః ॥

## రథసప్తమీ, కృత్యమ్

రథసప్తమీ సూర్య ప్రీతికరమైన రోజు. ఆరోజున తెల్లజిల్లేడు ఆకులను **శిరస్సుపై** భుజములపై ఉంచుకొని స్నానము చేయుట సర్వపాప హరము. సకలరోగహరము కూడా అగును. స్నానకాలమందు ఈ క్రింది శ్లోకములు పఠింపవలెను.

శ్లో॥1 యదా జన్మకృతం పాపం, మయా జన్మసు జన్మసు ।
తన్మే రోగంచ శోకంచ మాకరీ హంతు సప్తమీ ॥

2 ఏతజ్జన్మ కృతం పాపం యచ్చ జన్మాంత రార్జితమ్ ।
మనో వాక్కాయజం యచ్చ జ్ఞాతాజ్ఞాతేచ యే పునః ॥

3 ఇతి సప్తవిధం పాపం స్నానాన్మే సప్త సప్తికే ।
సప్తవ్యాధి సమాయుక్తం హర మాకరి సప్తమీ ॥

4 సప్త సప్త మహాసప్త సప్త ద్వీపా వసుంధరా ।
శ్వేతార్క పర్ణ మాదాయ సప్తమీ రథ సప్తమీ ॥

అనగా ఈ మకర సప్తమి, నేను చేసిన ఈ జన్మలోని పాపములనేగాక జన్మాంతరములందు ఆర్జించిన మహాపాపములను హరించుగాక, మనోవాక్కాయ రూపములుగానూ, తెలిసి తెలియక చేసిన పాపములను ఈ రకముగా 7 రకములైన పాపములనేగాక సప్తవ్యాధి దోషములను ఈ రథ సప్తమి పోగొట్టి నన్ను పరిశుద్ధుని చేయుగాక అని భావము – పై శ్లోకములతో స్నానమాచరించి ఈ క్రింది శ్లోకముతో శ్రీసూర్యనారాయణమూర్తికి అర్ఘ్యమీయవలెను.

శ్లో॥ సప్త సప్తి వహప్రీత, సప్తలోక ప్రదీపన ।
సప్తమీ సహితో దేవ! గృహాణార్ఘ్యం దివాకర ॥

సప్త నామక అశ్వములు గల రథారూఢా! సప్తలోకములను ప్రకాశింపచేయు సప్తమీ సహితుడవైన ఓ దివాకరా ఈ యర్ఘ్యమును స్వీకరింపుము – అని అర్ఘ్యమీయవలెను.

## భీష్మాష్టమీ

మాఘశుద్ధ అష్టమీ భీష్మాష్టమి యందురు. ఈ రోజు సంతార్థులగువారు భీష్మోద్దేశ్యముగా శ్రాద్ధము ఆచరించవలెను. భీష్మతర్పణము మాత్రము అందరూ చేయవలసినదియే. జీవత్పితృకులు ఐనచో సవ్యముగానూ, అజీవ పితృకులైనచో ప్రాచీనవీతముగా తిలలతోనూ తర్పణ చేయవలెను. ఈ తర్పణ చేయనిచో పుణ్యము హరించును – కావున ఇది అవశ్యకర్తవ్యము

వైయాఘ్ర పద్య గోత్రాయ సాంకృత్య ప్రవరాయచ ।
గంగా పుత్రాయ భీష్మాయ ఆజన్మ బ్రహ్మాచారిణే ॥

అపుత్రాయ జలం దద్మి నమో భీష్మాయ వర్మణే ।
భీష్మ శ్శాంతనవో వీరః సత్యవాదీ జితేంద్రియః ।
ఆభిరద్భి రవాప్నోతు పుత్ర పౌత్రోచితాం క్రియామ్ ॥

అనగా వ్యాఘ్రపాద్గోత్రోద్భవుడు, సాంకృత్య ప్రవరుడు, గంగా పుత్రుడు, ఆజన్మ బ్రహ్మచారి గనుక అపుత్రకుడైన భీష్మునకు తర్పణ మిచ్చుచున్నాను. దీనిచే శంతన పుత్రుడు, వీరుడు, సత్యసంధుడు, జితేంద్రియుడగు భీష్ముడు పుత్రపౌత్రాదులచే ఇవ్వబడు తిలోదక పిండ ప్రదానముతో పితరులు సంతోషమొందునట్లు సంతసించుగాక – అని భావము –

## తర్పణ క్రమః

1. వైయ్యాఘ్ర పద్యగోత్రం, సాంకృత్య ప్రవరం, గంగా పుత్రం, భీష్మవర్మాణం తర్పయామి (3 సార్లు)
2. ఆజన్మ బ్రహ్మచారిణం, అపుత్రం, భీష్మ వర్మాణం, తర్పయామి (3 సార్లు)
3. శంతను తనూ భావం, వీరం, సత్యవాదినం, జితేంద్రియం, భీష్మ వర్మాణం తర్పయామి (3 సార్లు)

ఈ రీతిగా తర్పణ మిచ్చి సవ్యముగా అర్ఘ్యమీయవలేను.

శ్లో॥ వసూనా మవతారాయ శంతనో రాత్మ జాయచ ।
అర్ఘ్యం దదామి భీష్మాయ ఆబాల్య బ్రహ్మచారిణే ॥

ఇతి భీష్మ తర్పణవిధిః

ఇతి శమ్

సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు ॥

# నిత్య పితృతర్పణమ్

పితరులనుద్దేశించి ప్రతిరోజు ఒక బ్రాహ్మణుని అర్చించి అర్ఘ్యా-ఽవాహనా, పిండప్రదాన వర్జ్యముగా భోజనము పెట్టుట నిత్యశ్రాద్ధమందురు - దీనిలో కర్తకుగానీ, భోక్తకుగానీ, పునర్భోజన, బ్రహ్మచర్యాది, నియమములులేవు.

ఇది చేయుటకు అవకాశము లేకున్నచో పంచయజ్ఞ ప్రకరణములోని ఈ మంత్రములో చెప్పినట్లుగా-

యత్పితృ భ్యస్స్వధా కరోత్యప్యపః తత్పితృ యజ్ఞస్సంతిష్ఠతే ।

ప్రతిరోజూ పితృదేవతలనుద్దేశించి జల తర్పణమైననూ చేసినచో అది పితృయజ్ఞమగును-

కావున మనకు జన్మ నిచ్చిన జననీ జనకులకు ప్రతిరోజూ కొంచెం నీటినైనా సమర్పించ కుండుట అమానుషమగును. కావున ఇచ్చట నిత్య పితృతర్పణవిధిని పొందుపరచుచున్నాను. అర్హులగు వారు ఈ విధిని అనుష్ఠించి కృతార్థులు కాగోరుచున్నాను. మరియు అమావాస్యాదులయందుగానీ, గ్రహణ, సంక్రమణాదులయందుగానీ పితృదేవతలకు తిలతర్పణమైనా చేయుట కర్తవ్యము. నిత్యపితృతర్పణకూ తిలతర్పణకూ భేదమేమనిన తిలతర్పణమందు పవిత్రము ధరించవలెను-లేదా మూడు దర్భలు ఉంగరపు వ్రేలికి ఉంచుకొనిచేయవచ్చును-లేదా బంగారు, వెండితోగానీ దర్భలముడి ఉంగరము చేయించుకొని అది ధరించి అయినా చేయవచ్చును.

మరియొక విశేషమేమనగా తిలతర్పణమునందు రూపము చెప్పవలెను- అనగా, వసురూపం, రుద్రరూపం, ఆదిత్యరూపం అని చెప్పవలసి యుండును-

మిగతా ప్రకరణము అంతా సమానమే- ఇప్పుడు, అమావాస్యా. సంక్రమణ, గ్రహణ సమయములప్పుడు చెప్పవలసిన సంకల్పము వ్రాయుచున్నాను-

## అమావాస్యా

ఓం ఓం ఓం- తిథౌ ప్రాచీనావీతీ-అస్మత్ పితౄణాం అక్షయ్యపుణ్యలోకావాప్త్యర్థం దర్శ శ్రాద్ధ ప్రతినిధి సద్యః తిలతర్పణంక రిష్యే

## గ్రహణములకు

రాహుగ్రస్త సో మోపరాగసమయే/ కేతుగ్రస్త సూర్యోపరాగ సమయే పితౄణాం అక్షయ్య పుణ్యలోకా వాప్త్యర్థం గ్రహణశ్రాద్ధ ప్రతినిధి సద్యః తిలతర్పణంకరిష్యే ।

## సంక్రమణములకు

మకర సంక్రమణ ప్రయుక్త ఉత్తరాయణ మహా పర్వపుణ్యకాలే / కర్కాటక సంక్రమణ ప్రయుక్త దక్షిణాయన మహాపర్వ పుణ్యకాలే పితౄణాం శాశ్వత స్వర్గాదిపుణ్యలోక ఫలావాప్త్యర్థం సంక్రమణ శ్రాద్ధప్రతినిధి సద్యః తిలతర్పణం కరిష్యే-

## నిత్య పితృతర్పణకు సంకల్పము

అస్మత్ పితౄణాం అక్షయ్య పుణ్యలోకావాప్త్యర్థం నిత్య శ్రాద్ధ ప్రతినిధి సద్యః నిత్య పితృతర్పణం కరిష్యే । నిత్యపితృతర్పణ మినహామిగిలిన దర్శ, సంక్రమణాది నిమిత్త తిలతర్పణలకు ఈ క్రింది మంత్రముతో పవిత్రముగానీ దర్భలుగానీ; దర్భముడి ఉంగరమునుగానీ ధరించవలెను.

ఓం పవిత్రవన్తః పరివాజమాసతే । పితైషాంప్రత్నో అభిరక్షతి వ్రతం ।

మహస్సముద్రం వరుణస్తిరో దధే । ధీరా ఇచ్ఛే కుర్ధరుణే ష్వారభం । పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే । ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః । అతప్తతనూర్నత దామో అశ్నుతే । శృతాస ఇద్వహంత స్తత్సమాసత । ఇతి మంత్రేణ పవిత్రం ధృత్వా । త్రిరాచామేత్......శ్రోత్రే. శ్రీగోవింద శ్రీమహావిష్ణో రాజ్ఞయా...విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ ప్రాచీనావీతీ అస్మత్ పితౄణాం అక్షయ్య పుణ్యలోక ఫలావాప్త్యర్థం...శ్రాద్ధ ప్రతినిధి సద్యః తిలతర్పణం కరిష్యే-/నిత్య శ్రాద్ధ ప్రతినిధి నిత్య పితృతర్పణం కరిష్యే- సవ్యం-నీరువదలి, ప్రాచీనా వీతి చేసుకొని, అవకాశముంటే ఎడమమోకాలు భూమికి ఆనించి, దక్షిణముఖముగా తర్పణ చేయవలెను- పితృతీర్థముగా జలము నీయవలెను-పితృతీర్థమనగా అరచేతినుండి బొటనవ్రేలికి, చూపుడు వ్రేలికి మధ్య భాగమునుండి నీరు, తిలలు వదలిపెట్టుట- (నిత్య పితృ తర్పణమందు రూపము చెప్పనక్కరలేదు- తిలతర్పణమునందు చెప్పవలెను)

పితరం-(తండ్రి).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

పితామహం-(తాత).....గోత్రం...శర్మాణం రుద్రరూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

ప్రపితామహం-(ముత్తాత).....గోత్రం...శర్మాణం ఆదిత్యరూపం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతరం-(తల్లి).....గోత్రాం...పదాం వసురూపాం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

పితామహీం-(నాయనమ్మ).....గోత్రాం...పదాం రుద్రరూపాం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

ప్రపితామహీం-(తండ్రికి నాయనమ్మ).....గోత్రాం...పదాం ఆదిత్యరూపాం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతామహం (తల్లితండ్రి).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతుః పితామహం (తల్లితాత).....గోత్రం...శర్మాణ రుద్రరూపం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతుఃప్రపితామహం-(తల్లికి ముత్తాత).....గోత్రం...శర్మాణం రుద్రరూపం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతామహీం-(అమ్మమ్మ).....గోత్రాం...పదాం వసురూపాం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతుఃపితామహీం-(తల్లికి నాయనమ్మ).....గోత్రాం...పదాం రుద్రరూపాం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతుఃప్రపితామహీం-(తల్లినాయనమ్మకు అత్తగారు).....గోత్రాం...పదాం ఆదిత్యరూపాం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

ఆత్మపత్నీం-(తనభార్య).....గోత్రాం...పదాం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

సుతం-(కుమారుడు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

జ్యేష్ఠ/ కనిష్ఠ-భ్రాతరం-(సోదరులు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

జ్యేష్ఠ/ కనిష్ఠ-పితృవ్యం-(తండ్రి సోదరులు).....గోత్రం...శర్మాణం వసురూపం

స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతులం-(మేనమామ).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

దుహితరం-(కుమార్తె).....గోత్రాం...పదాం వసురూపాం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

భగినీం-(తోబుట్టువు).....గోత్రాం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

దౌహిత్రం-(కూతురి కొడుకు)...గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

భాగినేయకం-(మేనల్లుడు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

పితృభగినీం - (మేనత్త) ...గోత్రాం...పదాం (సభర్తృకాం) వసురూపాం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

మాతృభగినీం-(తల్లితోబుట్టువులు) .....గోత్రాం...పదాం (సభర్తృకాం) వసురూపాం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

జామాతరం- (అల్లుడు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

భావుకం-(బావగారు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

స్నుషాం-(కోడలు).....గోత్రాం...పదాం వసురూపాం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

శ్వశురం-(పిల్లనిచ్చినమామ).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

శ్వశ్రూం-(పిల్లనిచ్చిన అత్త).....గోత్రాం...పదాం వసురూపాం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

శ్యాలకం-(భార్య సోదరుడు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

స్వామినం-(ప్రభువు).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

గురుం-(బ్రహ్మోపదేశము చేసిన వారు/ తండ్రి).....గోత్రం...శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి (అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

రిక్థినం ...............గోత్రం........శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి

(అని ముమ్మారు నీరు తిలలువదలవలెను)

నివీతీ భూత్వా (జంధ్యము దండవలే వ్రేలాడునట్లు ధరించి)

శ్లో॥ యేకే చాస్మత్కులేజాతాః అపుత్రా గోత్రిణో మృతాః ।

తే గృహ్ణన్తు మయాదత్తం సూత్రనిష్పీడనోదకం ॥

శ్రీ రామ రామ రామ యనుచూ యజ్ఞోపవీత గ్రంథులపై నీరు పోసిపిండి, ఆ ముళ్లను కళ్లకద్దుకొనవలెను-సవ్యముగా పవిత్రమును ఊడదీసి త్రొక్కని చోట, ఆ దర్భలనూ, తర్పణజలమును పారపోయవలెను. ఇది పితృతర్పణవిధి.

ఇత్థం
సుహృజ్జన విధేయః
**మార్తి వేంకట్రామశర్మా**

విద్యార్థులకు శబ్ద పరిచయం నిమిత్తం వర్గత్రయము, కారుణ్య వర్గములో వచ్చు శబ్దరూపముల నిచ్చుచున్నాను.

అకారాంతః పుంలింగో రామశబ్దః = రాముడు

| | | | | |
|---|---|---|---|---|
| ఏకవచనం | - ద్వివచనం | | బహువచనం | |
| రామః | - రామౌ | - | రామాః | (ప్రథమావిభక్తిః) |
| హేరామ | - హేరామౌ | - | హేరామాః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| రామం | - రామౌ | - | రామాన్ | (ద్వితీయా విభక్తిః) |
| రామేణ | - రామాభ్యాం | - | రామైః | (తృతీయా విభక్తిః) |
| రామాయ | - రామాభ్యాం | - | రామేభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| రామాత్ | - రామాభ్యాం | - | రామేభ్యః | (పంచమీ విభక్తిః) |
| రామస్య | - రామయోః | - | రామాణాం | (షష్ఠీ విభక్తిః) |
| రామే | - రామయోః | - | రామేషు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, పితామహ, ప్రపితామహ, మాతామహ, మాతుః పితామహ, మాతుః ప్రపితామహ, సుత, పితృవ్య, మాతుల, దౌహిత్ర, భాగినేయక, భావుక, శ్వశుర, శ్యాలక, ఇత్యాదయః । (అనగా పైన పేర్కొనిన శబ్దములన్నియూ రామ శబ్దము వలెనే చెప్పవలెను)

ఋకారాంతః పుం లింగః పితృశబ్దః - తండ్రి -

| | | | | | |
|---|---|---|---|---|---|
| పితా | – పితరౌ | – | పితరః | (ప్రథమా విభక్తిః) |
| హేపితః | – హేపితరౌ | – | హేపితరః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| పితరం | – పితరౌ | – | పితౄన్ | (ద్వితీయావిభక్తిః) |
| పిత్రా | – పితృభ్యాం | – | పితృభిః | (తృతీయా విభక్తిః) |
| పిత్రే | – పితృభ్యాం | – | పితృభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| పితుః | – పితృభ్యాం | – | పితృభ్యః | (పంచమీ విభక్తిః) |
| పితుః | – పిత్రోః | – | పితౄణామ్ | (షష్ఠీ విభక్తిః) |
| పితరి | – పిత్రోః | – | పితృషు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, భ్రాతా, జామాతా, ఇత్యాదయః

ఋకారాంతః స్త్రీలింగో మాతృశబ్దః = తల్లి.

| | | | | |
|---|---|---|---|---|
| మాతా | – మాతరౌ | – | మాతరః | (ప్రథమావిభక్తిః) |
| హేమాతః | – హేమాతరౌ | – | హేమాతరః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| మాతరం | – మాతరౌ | – | మాతౄః | (ద్వితీయా విభక్తిః) |
| మాత్రా | – మాతృభ్యాం | – | మాతృభిః | (తృతీయా విభక్తిః) |
| మాత్రే | – మాతృభ్యాం | – | మాతృభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| మాతుః | – మాతృభ్యాం | – | మాతృభ్యః | (పంచమీ విభక్తిః) |
| మాతుః | – మాత్రోః | – | మాతౄణామ్ | (షష్ఠీ విభక్తిః) |
| మాతరి | – మాత్రోః | – | మాతృషు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, సాపత్నీమాతా, దుహితా, ఇత్యాదయః

ఈకారాంతః స్త్రీలింగో గౌరీశబ్దః = పార్వతి.

| | | | |
|---|---|---|---|
| గౌరీ | - గౌర్యౌ | - గౌర్యః | (ప్రథమా విభక్తిః) |
| హేగౌరి | - హేగౌర్యౌ | - హేగౌర్యః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| గౌరీం | - గౌర్యౌ | - గౌరీః | (ద్వితీయా విభక్తిః) |
| గౌర్యా | - గౌరీభ్యాం | - గౌరీభిః | (తృతీయా విభక్తిః) |
| గౌర్యై | - గౌరీభ్యాం | - గౌరీభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| గౌర్యాః | - గౌరీభ్యాం | - గౌరీభ్యః | (పంచమీ విభక్తిః) |
| గౌర్యాః | - గౌర్యోః | - గౌరీణాం | (షష్ఠీ విభక్తిః) |
| గౌర్యాం | - గౌర్యోః | - గౌరీషు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, పితామహీ, ప్రపితామహీ, మాతామహీ, మాతుః పితామహీ, ఆత్మపత్నీ, భగినీ, పితృ భగినీ, మాతృభగినీ, ఇత్యాదయః

ఆకారాన్తః స్త్రీలింగో రమా శబ్దః = లక్ష్మి

| | | | |
|---|---|---|---|
| రమా | - రమే | - రమాః | (ప్రథమా విభక్తిః) |
| హేరమే | - హేరమే | - హేరమాః | (సంబోధన ప్రథమావిభక్తిః) |
| రమాం | - రమే | - రమాః | (ద్వితీయా విభక్తిః) |
| రమయా | - రమాభ్యాం | - రమాభిః | (తృతీయా విభక్తిః) |
| రమాయై | - రమాభ్యాం | - రమాభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| రమాయాః | - రమాభ్యాం | - రమాభ్యః | (పంచమీ విభక్తిః) |

| | | | |
|---|---|---|---|
| రమాయాః – | రమయోః – | రమాణాం | (షష్ఠీ విభక్తిః) |
| రమాయాం – | రమయోః – | రమాసు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, స్నుషా, ఇత్యాదయః

నకారాంతః పులింగో గుణిన్ శబ్దః = గుణవంతుడు

| | | | |
|---|---|---|---|
| గుణీ – | గుణినౌ – | గుణినః | (ప్రథమా విభక్తిః) |
| హేగుణిన్ – | హేగుణినౌ – | హేగుణినః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| గుణినం – | గుణినౌ – | గుణినః | (ద్వితీయా విభక్తిః) |
| గుణినా – | గుణిభ్యాం – | గుణిభిః | (తృతీయా విభక్తిః) |
| గుణినే – | గుణిభ్యాం – | గుణిభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| గుణినః – | గుణిభ్యాం – | గుణిభ్యః | (పంచమీ విభక్తిః) |
| గుణినః – | గుణినోః – | గుణినాం | (షష్ఠీ విభక్తిః) |
| గుణిని – | గుణినోః – | గుణిషు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, స్వామిన్, రిక్థిన్, ఇత్యాదయః –

ఉకారాంతః పుంలింగః శంభుశబ్దః = శివుడు

| | | | |
|---|---|---|---|
| శంభుః – | శంభూ – | శంభవః | (ప్రథమా విభక్తిః) |
| హేశంభో – | హేశంభూ – | హేశంభవః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| శంభుం – | శంభూ – | శంభూన్ | (ద్వితీయా విభక్తిః) |
| శంభునా – | శంభుభ్యాం – | శంభుభిః | (తృతీయా విభక్తిః) |
| శంభవే – | శంభుభ్యాం – | శంభుభ్యః | (చతుర్థీ విభక్తిః |

| | | | |
|---|---|---|---|
| శంభోః – | శంభుభ్యాం – | శంభుభ్యః | (పంచమీ విభక్తిః) |
| శంభోః – | శంభ్వోః – | శంభూనామ్ | (షష్ఠీ విభక్తిః) |
| శంభౌ – | శంభ్వోః – | శంభుషు | (సప్తమీ విభక్తిః) |

ఏవం, గురుః, ఇత్యాదయః

ఊకారాన్తః స్త్రీలింగః, శ్వశ్రూ శబ్దః = అత్త

| | | | |
|---|---|---|---|
| శ్వశ్రూః – | శ్వశ్వౌ – | శ్వశ్వః | (ప్రథమా విభక్తిః) |
| హేశ్వశ్రు – | హేశ్వశ్వౌ – | హేశ్వశ్వః | (సంబోధన ప్రథమా విభక్తిః) |
| శ్వశ్రూం – | శ్వశ్వౌ – | శ్వశ్రూః | (ద్వితీయా విభక్తిః) |
| శ్వశ్వా – | శ్వశ్రూభ్యాం – | శ్వశ్రూభిః | (తృతీయా విభక్తిః) |
| శ్వశ్వై – | శ్వశ్రూభ్యాం – | శ్వశ్రూభ్యః | (చతుర్థీ విభక్తిః) |
| శ్వశ్వాః – | శ్వశ్రూభ్యాం – | శ్వశ్రూభ్యః | (పంచమీ విభక్తిః) |
| శ్వశ్వాః – | శ్వశ్వోః – | శ్వశ్రూణామ్ | (షష్ఠీ విభక్తిః) |
| శ్వశ్వాం – | శ్వశ్వోః – | శ్వశ్రూషు | (సప్తమీ విభక్తిః) |

